వ. అంత నాబ్రాహ్మణకుమారుండును దత్తీరవాసులకు నిజార్జితద్రవ్యంబులు వ్యయంబు చేసి గోభూతిలహిరణ్యాజ్యవాసోధాన్యగుడరౌప్యలవణంబులనుదశదానంబులనుదు లాపురుష హిరణ్యగర్భ బ్రహ్మాండకల్పవృక్ష సహస్రధేను హిరణ్యకామధేను హిర ణ్యాశ్వ హిరణ్యరథ హేమహస్తి హేమలాంగూలపంచలాంగూల విశ్వచక్ర కల్ప లతాసప్తసాగర రత్నధేనుభూత సంఘట్టనంబులను షోడశమహాదానంబులు చేసి కాశికాపురంబున కరిగె నప్పుడు. 161

సీ. చిత్రకూటసమానచిత్రకూటవిమాన, భానురంబు విశిష్టభూసురంబు
వైజయంతవితానవైజయంతవితాన, భూషణంబు నృపాలభీషణంబు
భాసమానశశిప్రభాసమానకవాటము, సుందరంబు కిరాటమందిరంబు
సుమనస్తతోద్దామ సుమనస్తుతారామ, బంధురంబురు శూద్రసింధురంబు
తే. సతతబహువైభవాసదృశప్రభావ, కీర్తిరాజితకుండలీకృతసుధీర
వజ్రమణిదీపవప్రాంశువలయలలిత, గోపురంబొప్పరహించుఁ గాశిపురంబు. 162

ఉ. ఆపుటభేదనేంద్ర ధృషదావళికల్పితగోపురాళిపై
నేపున మాపు రేపుఁ జను నింద్రుదినేంద్రులపర్వతద్యుతు
ల్పాపుర వీనికిన్ గ్రహణబాధయ పర్వములందు నేక్రియన్
బ్రాపిత మయ్యె నంచు మది భ్రాంతి వహింతురు తాంత్రికోత్తముల్. 163

తే. అట్టిపుణ్యస్థలంబున కరిగి వేడ్క, గడలుకొన మణికర్ణికాఘట్టమునను
నిలిచి జలకచ్ఛమున స్నానసిద్ధిఁ బూని, వెడలి మాధ్యాహ్నికక్రియ ల్వేగ దీర్చి.

క. మణికర్ణిక మణికర్ణిక, మణికర్ణిక యనుచు నుడువు మనుజులకెల్లన్
గణనాతీతపుదోషము, లణఁగి శతక్రతుఫలంబు లగునని తలఁచెన్. 165

వ. అంతట సర్వటుశిఖామణినవకచమకంబులరుద్రన్యాసయుక్తంబుగా విశ్వేశ్వరునభి షిక్తుం జేసి పూజించిప్రదక్షిణనమస్కారంబులు గావించియిట్లని స్తుతియించె. 166

సీ. జయభక్తమందార జయదుష్టజనదూర, జయజగదాధార శరణుశరణు
జయనిత్యకల్యాణ జయభృత్యసంత్రాణ, జయరమాధిపబాణ శరణుశరణు
జయగోత్రపుత్రీశ జయరక్షితసురేశ, జయపంచశరనాశ శరణుశరణు
జయశరద్ఘనగాత్ర జయపావనచరిత్ర, జయకేందుశిఖినేత్ర శరణుశరణు
తే. జయనిశితశూలసాధన శరణుశరణు, జయమఖామోఘనాశన శరణుశరణు
జయహయీకృతనందీశ శరణుశరణు, జయమహాదేవవిశ్వేశ శరణుశరణు. 167

సీ. శ్రీపార్వతీకుచశిఖరిస్థలవిహార, హారాయమాణమహాభుజంగ
జంగమస్థావరసంచారసమభావ భావజరూపప్రభావహరణ



రణరంగనిర్జిత రౌద్రమహాసుర, సురయక్షసేవిత చరణయుగళ
గళదరస్థాపిత కాలకూటక్షీర, క్షీరాబ్ధిపుత్రీశ ఘోరబాణ
తే. బాణనామకరాక్షస త్రాణదక్ష, దక్షకల్పిత యాగవిదారణోగ్ర
యుగ్రభీమాదినామధేయప్రసిద్ధ, సిద్ధభయభంగ కాశివిశ్వేశలింగ. 168

క. అని సన్నుతించి వేడ్కలు, గొన నాత్తఁగ బ్రహ్మచారికుంజరుఁడు గ్రమం
బున దేవతాధివాసము, లనువొందఁగఁ గాంచి భక్తి నలమినమదిలోన్. 169

క. డుంఠిగణాధ్యక్షుని శివి, కంఠుని భైరవునిఁ జాండికం బటువిద్వ
త్కంఠీరవ మపుడు మహా, కుంఠితతాత్పర్యములను గొలిచి భజించెన్. 170

వ. తదనంతరంబునఁ బంచక్రోశంబునం గల మహాదివ్యలింగంబుల సేవించి యచ్చోటు వాసి తైర్థికజనహితసమ్యాగయ యగుగయకుఁజని గదాధరుంగొనియాడి ప్రయాగ కరిగి త్రివేణీసంగమంబునం గృతస్నానదానాద్యనుష్ఠానుండై మాధవునారాధించి సప్తపర్ణపటంబుంగనుంగొని త్రివేణీతీర్థంబులు నించినకావడి గైకొని పంచక్రోశం బునవొక్కమరకతలింగంబు సంగ్రహించి నిజస్థానగమనోన్ముఖుండై. 171

సీ. కావడిపై నంటఁగట్టిన యొక కావి, శాటికంబళియాత్ర సంచి యలర
నేతిలడ్డిగనిళ్లు నించినసొరకాయ, బుఱ్ఱ లిర్వంకలఁ బొసఁగియుండ
సెగనెత్తి కలుఁచగా బిగియఁ గట్టినపంచె, పైబిగించిన ప్రాఁత బట్ట యొప్ప
ముఖఘర్మములటోపి మణుఁగఁజుట్టినపల్లె, కొనలు మారుతలౌల్యమున హరింప
తే. గమనజవమున నుత్త్రాడు కావ డదరి, కిఱ్ఱుకిఱ్ఱని భుజమునఁ గేళిసల్ప
గొడరుద్రాక్షమాలిక ల్కంఠసీమఁ, దనరవచ్చెను వేడ్కన తైర్థికుండు. 172

క ఈరీతిఁ దనగృహంబున, కౌరయఁ జనుదెంచి కావ డటువించి మహా
ధీరుఁడు జననీజనకుల, కారూఢిగ సంఘటించె సాష్టాంగంబుల్. 173

క. తత్సమయంబున వారలు, వత్సా మతి యాత్రసలిపి వచ్చితె యని యు
ద్యత్సంతోషంబునఁ దమ, వత్సస్థలిఁ జేర్చి ప్రేమ వర్ధిలి చెలఁగన్. 174

తే. శిరము మూర్కొని వదనంబు చెమట దుడిచి
యాయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధి
గాను దీవించి యత్యంత కరుణ మెఱయఁ
గొడుకుతోడను నిట్లని నుడివి రపుడు. 175

క. ఏయేపుణ్యస్థానము, లేయేతీర్థస్థలంబు, లేయేద్వీపా
లేయేభూములు సూచితి, వాయామహిమలు వచింపు మర్భక మాకున్. 176

క. అని యడిగిన తలితండ్రుల, కనునయమునఁ గాశి గయ ప్రయాగము మొదలౌ
ఘనపుణ్యక్షేత్రంబులు, గని వచ్చితి లింగ మిదిగొ కౌతుక మమరన్. 177

క. ఈపురవరమణిచెంగట, నీపరమేశ్వరుఁ బ్రతిష్ఠ సేంతయుఁ జేతుఁ
దాఁపురము మోక్షలక్ష్మికిఁ, గాపుర మభివృద్ధిఁ బొందు, గద మన కనియెన్. 178

తే. పుత్త్రకునివాక్యవిస్ఫురదాహ్లాదమునకుఁ, దల్లిదండ్రులు సంతోష ముల్లసిల్లి
నపుడు పాషాణభేదుల కర్థమిచ్చి, శివి నొకదేవళంబు గట్టించి రపుడు. 179

సీ. డంబైన గర్భగృహం బంతరాళికం, బును సుఖమంటపంబును జెలంగ
గాలిమంటపము ప్రాకారంబు లోలీలు, బోదెలు, చుట్టులు పొందుపఱుఁగఁ
గప్పటచట్టము ల్ఘనగోపురమ్ములు, జగతియుఁ జప్పట ల్బాగసుగులుకఁ
గన్పుగోడలు రాతికంబము ల్పావలను,న్నము సువర్ణము ద్వారసమితి వెలయ
తే. దృష్టిపాత్త్రపుబొమ్మలు దేజరిల్ల, నుఱుకుసింగంబు లరగూళ్ల మెఱుఁగుఁదోర
ణములు చిత్త్రవ్యక్రొంబనుల్ రమణకెక్క, దేవళము మించె నత్యంతదివ్య మగును.

క. ఆదేవళంబులోన మ, మహాదేవుని నొక్కదివ్య మగుశుభవేళం
బాదుగఁ బ్రతిష్ఠ చేసిరి, వేదాగమశాస్త్రరీతి వేడ్కదలిర్పన్. 181

సీ. చెఱఁగువోవతిపైనిఁ జీరాడఁగా బోడి, తలఁజుట్టు ధౌతవస్త్రంబు మెఱయఁ
జెక్కులకును డిగి పిక్కటిల్లు విభూతి, పెండెకట్లు లలాటభిత్తి నమర
గళమున నులిగొన్న కావిదారముతోడి, రుద్రాక్షమాలికల్ రూఢిఁ దనర
మారేఁడుబుజ్జలో మక్కళించినసందిఁ, గట్టినచంద్రశేఖరుఁడు వెలయఁ
తే. బెట్టె మూఁకుడులో మొగబీరపత్త్రి
మట్టిధూపార్తి దీపముఁ బెట్టు చమురుఁ
బొందుపఱుచుక మునిమాపు పూజసేయఁ
గ్రొత్తకాణాచితంబళి హత్తుకొనియె. 182

క. ఈతీరున నలతంబళి, భూతేశునిపూజసేయ బుష్పంబుల సం
ఘాతముగొని తేలే మని, యాతట్టున నొక్కతోఁట నమరఁగఁ జేసెన్. 183

సీ. సంపెఁగల్ మొల్లలు జాజులు గన్నేర్లు, విరజాజులును మంచి కురువకములు
ప్రొద్దు దిరుగుడుపూలు పొన్నలు మల్లెలు, పారిజాతములు సేవంతి విరులు
తామర ల్సౌర్యకాంతమ్ములు కల్వలు, బొండుమల్లెలపాద ల్పొగడతరువు
లల్లిపువ్వులును నంద్యావర్తములు వాడ, గన్నేరులు తురాయి గట్టిపూలు
తే. మాచిపత్త్రి గగ్గెర మరువము కురు, వేరు దవనమ్ములును పట్టివేళ్లు గుములు
బిల్వవృక్షము లాదిగాఁ బేరుగలవి, ప్రబల నొకతోఁటవేయించి బావిద్రవ్వె. 184

మ. అమితానర్ఘ్యనిబద్ధశుద్ధశశికాంతాయామసోపానసం
గమ మంబుగ్రహణాగతోరుకుధికాక్రాంతస్ఫురత్కుట్టిమం



బమలాంభోరుహషండషాండుకుముదాచ్ఛామోద సంవాసితం
బమృతప్రాయజలాభిపూర్ణ మగుచు న్నాబావి యొప్పుంగడున్. 185

క. అబ్బావికిఁ జేయేతం, బుబ్బుచుఁ దంబళి యొనర్చి యుత్సాహంబుఁ
గుబ్బతిలఁ గొన్ని చెట్లకు, నిబ్బరమున జలము లెత్తి నిస్త్రాణుం డై. 186

తే. ఎలమి మఱికొన్ని చెట్టుల కెత్తియెత్తి, యలసి ముంగిసమ్రానితో నానియుండ
గుండ నిండారఁగా ముంచి కూడు దినఁగ, నింటి కేగెను బడలిక లంటి పెనఁగ.

వ. అంత నొక్కబక్కనక్క గుక్కమిక్కనుచు డొక్కం బిక్కటిల్లిన క్షుధానలం
బున దందహ్యమానం బై డస్సి. 188

తే. పుట్టలను దిట్టలను జెట్లఁ బొట్లఁ గట్ల, వంకలను డొంకలను బీళ్లఁ బాళ్ల ప్రాళ్ల
గుప్పలను దిప్పలను మళ్ల గుళ్ల నూళ్ల, దిరిగి యాహార మందక సొరిగి యరిగి. 189

సీ. వాణికై పోరాడ వచ్చి యెందఱు బ్రహ్మ, దేవుల మనువారు దీరి చనిరి
పార్వతీరతులకై బహుపోరి యెందఱు, రుద్రుల మనువారు రోసి చనిరి
సిరినిఁ జేపట్టఁగాఁ జేరి యెన్ని దశావతారము లలహించి తీరిపోయె
శచిమాఱుమనువు రచ్చలఁ బెట్టి యెందఱో, నింద్రులమనువార లేగి రహహ
తే. చూడ నవి యెల్ల యుగచర్య సుద్దులయ్యె
బోయెఁ గాలంబు పూర్వ విస్ఫురణదప్పె
దార్ఢ్య మాలోచనము తెల్వి దగ్గువడియె
నౌరవిధి నేటి కిట్లాయె ననుచు నడరి. 190

తే. ప్రాముజఠరాగ్నిచేఁ గింక రోమియనుచు, నడరువేదనచేఁ గ్వయాస్వామి యనుచు
విస్మయపుమూర్ఛచే నాహ తోస్మి యనుచు, బలువరింపంగ సాగెన బ్బక్కనక్క.
ఇట్లు క్షుధాతురత్వంబునఁ గంఠగతప్రాణం బై నోరం దడిలేక మాటిమాటికిఁ బాడ
ము మూర్ఛల నలసి సొలయుచు మెత్తమెత్తగావచ్చి తత్కూపతటస్థిత ద్రోణికా
గ్రంబున నున్నయల్పజలంబులం దనకంఠంబువడిపికొని యయ్యంతంబుముంగిసమ్రా
నికి వెదురునకు నంటఁ గట్టినవారు పరిమళం బాఘ్రాణించి దోనిం బడి చని నేఁడీ
చతుకృత్తిరజ్జువున క్షుధాభారంబు హరించెదననితలంచి యుబ్బుచు నెక్కనుకమ
కంబున ముంగిసమ్రానిపైకిఁ జివుక్కున నెక్కి యబ్బక్కనక్క దారువేణుబంధనం
బగుచర్మరజ్జువుఁ దెగం గొఱికిన. 192

తే. మ్రాను మీటుగ నెగయ గోమాయు వప్పు, డేకతాళప్రమాణమ్ము లెగసి కూన
గుంతలోఁబడ గ్రుడ్డువె ల్వెడలక నాల్కనడుముగఱుచుక నఱచుచు బెడిసిమడిసె.

వ. ఇట్లు క్షుధాతురత్వంబున నాహారంబె చూచెఁగాని తనచేఁటు దెలియదయ్యె నివా
నక్క తెలియంగున రాజసంయోగంబె చూచెదవుగాని యితరోపద్రవంబులు విచారింప

నయిన నిత్తెఱంగువఁ జిత్తంబునఁ దత్తరంబు లేక తెలిసి మెలంగు మని హంసంబు వినయోక్తులు పలుకుసమయంబున. 194

చ. అలమిన వేడ్క ఘోటకనకాంగులు మజ్జిగఁ జిల్కఁగాఁ పుఁగూఁ
తులు తెలియావనాళములు ద్రొక్కఁగ జారగభీరనాయిక
ల్నిలయముఁ జేరఁ దస్కరులు నెక్కొనుభీతిని దావు లెక్కఁగాఁ
జెలఁగుచు వేగుఁజుక్క పొడిచెన్ బలసూదనదిక్తటంబునన్. 195

క. అంతట హేమావతి గే, హాంతరమున కేగి ప్రార్థివాయత్తమతిం
గంతుసుమకుంతదళిత, స్వాంతంబున నా దినాంతసంతమసమునన్. 196

చ. కలపము గబ్బిగుబ్బలను గష్మురుపూలసరాలు గొప్పునం
గులికడి చంద్రకావి నెఱి కుచ్చెలఁ దీర్చిన కోకశ్రోణినిం
దిలకము మోమునన్ మణులఁ దీరినసొమ్ములు మేన వేడుకన్
వెలయ నమర్చి మేల్ముసుగు వేసి నృపాలునికేళిఁ దేలఁగన్. 197

## మూఁడవరాత్రికథ.

క. కలహంసోజ్జ్వలరత్నశ, కలహంసక యుగము ఘల్లుఘల్లని మ్రోయన్
గలహంసగమన చనఁగాఁ, గలహంసము హేమవతిని గని యిట్లనియెన్. 198

ఉ. ఇంకొకగాథ గద్దు విను మింతటిలోఁబడి పాఱిపోవఁ డో
పంకరుహాయతాక్షి యుపభర్తల హత్తుక తత్తరాన మీ
నాంకునికేళిఁ దేలఁగఁ జనంగ నొకానొకమాట వచ్చినన్
బొంకఁగ లేవు బంతి యని బొంకవలెం గులటావధూటికిన్. 199

క. అని రాజహంసమణి పల్కిన హేమావతి వినోదకేళిగతి గిరు
క్కన మరలివచ్చి యాకథ, వినియెద ననువొందఁ దెల్పు విహగోత్తంసా. 200

వ. అని యడిగిన హేమావతికి హంసం బిట్లనియె. 201

క. విను మనఁగా ననఁగా నొక, కనకోజ్జ్వలకూటఘోట ఘనగోపురశో
భనకృతశధరీకృతనా, కనగరిమణిభద్రపురము గల దొకభూమిన్. 202

క. ఆనగరము భోగప్రతి, భానగరిపుఁ డైనమణిభద్రుఁడు భద్రా
నూనచరిత్రుఁడు కాంతిను, ధానిధి నృపు డెంచ శాశ్వతమ్ముగ నేలున్. 203

తే. అతని చెంగట నసహాయుఁ డనెడువాఁడు, చండదోర్దండమండిత మండలాగ్ర
దండితారాతిరిపుతల గుండుగండఁ, డనెడిబిరుదొంది తిరుగు నాయకులలోన. 204



సీ. భిండివాలాసికోదండభల్లాతక, నారాచరోహణనఖరవజ్ర
ముష్టిముద్గరశూలముసలభుసుండిక, ప్రాసప్రకూర్మకర్పటకటార
కాగరాయోదండకణయకుంతాంతళ, పరశుతోమరచక్రపరిఘపట్ట
సములునంకిణికొదిసబళంబు చివ్వఁటె, సెలకట్టె యాదిగా నిల నుతింపఁ

తే. దనరు ముప్పదిరెండాయుధములు మఱియుఁ
జిఱుత చెయ్యస్త్రము గండగత్తెర తుపాకి
గొరకను సుగాలమును గ్రద్దగోళ్లు బుట్టె
చూరిబాణాధరించు నవ్వీరుఁ డెపుడు. 205

వ. వెండియు నవ్వీరుండు సమదండ గజదండ భృంగిదండ యెడమపరభృంగి కుడిపరభృంగిభృంగిపటలముపయి సరపుదండ సింగఁపుదండ పాదలికదండ యడుగడుగుపాదలికదండ మద్దెలసంచుదండ కుక్కుటపుదండ మొదలుగాఁగల పదిరెండుదండల యఖండపాండిత్యంబు దెలిసి యెడమడుగుపరువడి కుడియడుగుపరువడి కదలుపరువడి దాఁటుడుగుపరువడి కోపుపరువడి అంత్రటీకనాట్యము ధాయ దాఁటుధోడఊరుధోడ ఝాటుథాఁటు కపాలు ధారుకధారుక ధాకు ధాఁటు ధాకు ఝాటు నివి మొదలైన పదునాలుగువిసరులమర్మంబులుం జూచి కక్కి కొక్కిస డొక్కరముత్తెర డొక్కరము కుమ్మరింపు బోడింపు సందుసీసంబును గొంతుమారును సమసంబును సురాటంబును జేవయుఁ గందనంబును గల్లంబును దొట్టును గిర్లయుంబరి బొందుటయురొండివేటును ఫణంబును గన్నాతుసుభారంబును చొంగిణియుఁ బెట్లాగును రూణింపును సరిబిత్తరంబును లాగును విట్టాలయంబును దిణింగిణియుఁ బాదనివారణంబును బాదగళాప్తియు గళకత్తెరయుఁ గాశనిల్కడయు నృసింహంబును నాదియగు ముప్పదిరెండువిన్నాణంబుల నాణెంబు పరీక్షించి వంటియడుగుకత్తెర సర్వబంధకత్తెర పాదలికకత్తెర చిట్టడుగుకత్తెర పావుపావులు జాగినపావు మొదలుగాఁగల పదిరెండుపరువళ్లయగణ్యప్రావీణ్యం బెఱింగి హరిగతి గజగతి వ్యాఘ్రగతి మహిషగతి జంబుకగతి మర్కటగతి మార్జాలగతి హరిణగతి చకటగతి పక్షిగతి తాండవగతి నరగతి మొదలైనపదిరెండుగతుల యవార్యచాతుర్యంబు నేర్చి విఘ్నచక్రంబును శామబాణంబును నాగబంధనంబును దొలకరిమెఱుపును అల్లిమత్తును విస్సందును హస్తాభరణంబును బదఖండనంబును బరిత్రాడునులోబిత్తరి వెలిబిత్తరి సర్పాంకుశంబు మొదలుగాఁగల పదిరెండుగాయమానంబుల భేదంబులు విచారించి లోమొన నెలిమొన యునిమొన ముమ్మొన చతురమొన పుణ్యామొన పాపపుమొన చాటడుగుమొనకదలుమొన అరమీటుమొన నెఱమీటుమొన సరితాళంపుమొన యాదిగాఁగలపదిరెండుమొనల నాకితేరి లో వెలిగజ్జదుముకు చూరణనఱకు మొదలగునఱుకులదగులుంగనుం

గోని దంతనిల్కడకవలు తుటుము కలయిక మెలకువకింగళింపుదిశాపదిశలు పాదపు పారువ హస్తపుపారువ దేహపుపారువ నయనపారువ విసరాకడ ఏకసరపైసర భృంగి పటలము ఝుంపు కెక్కుకరలాఘవంబు లాదియగా షోడశోపవీతంబులరీతులు నేర్చి భ్రాంతంబును భ్రాంతంబును ఆప్లుతంబును ఆవిష్కృతంబును అష్టికంబును అకరం బును అవికరంబును మిశ్రితంబును మానుషంబును నిర్మర్యాదయు విచిత్రంబును ఛిన్నంబును సవ్యజానువు అపసవ్యజానువు క్షిప్తంబును ద్రుతంబునుగుడంబునులంబ నంబును సవ్యబాహువు వినీతబాహువు త్రిబాహువు సవ్యోత్తరంబునుఉత్తరంబును తుంగబాహువు సవ్యకరంబును గ్రథితంబును సూధికంబును అపృష్టతప్రహారంబును వల్గితంబును స్వస్తికంబు లనెడి ద్వాత్రింశత్ప్రచారంబులువిచారించి యుపక్రపరా క్రమంబున సాటిలేక మెలంగు మఱియును. 206

ఉ. సాదన మేలు చెంపపయి జన్నగ వ్రేలు రుమాలు మీసము
ల్మీఁదను జీరకేలు జిగిమించఁగఁ గప్పినశాలువైరులన్
వాములగెల్చు వాలుచెలువంబుగ దాల్చినపూలు నొప్పఁగా
నాకారయొద్దసంబళికి లంగుచు నుండు నతండు ధీరతన్. 207

తే. అతనికులభామ గుణధామ యలఘుకామ, యతులితారామ యసమరూపాభిరామ
వదనజితసోమ యధికలావణ్యసీమ, హేమరేఖాసనాము ధైయింతి వెలయు. 208

ఉ. కన్నులచందము న్నగుమొగంబు విధంబును గల్కి పల్కులుం
జన్నులపొంకము న్నడుముచక్కఁదనంబును బాహులందముం
బెన్నెఱిగుంపుసోయగము బిత్తరి యాచెలియందకాక యే
కన్నియలందుఁ గన్గొన మెగాదిగఁ జూడమె మూఁడులోకముల్. 209

సీ. జల్లిమాటలుగాక సరిసేయవచ్చునే, సవరంబు లీశిరోజాతములకు
బూఁతసుద్దులుగాక పోల్పంగ వచ్చునే, చందనం బీమేనిగంధమునకు
మాటమాత్రముగాక దీటుగానచ్చునే, గగన మీనడుము సోయగమునకును
పదరుపల్కులు గాక తుదిసాటివచ్చునే, కిన్నరకాయ లీచన్నుగవకుఁ

తే. జక్కఁదనమెల్ల ముల్లెగా సంతరించి, బ్రహ్మదేవుండు తననేర్పు ప్రౌఢిచేతఁ
దీర్చిసృజియించెఁ గాబోలు దీనినవఁగ, వీటఁ జరియించునొక్కొకవేళ నదిగ్గ

తే. దానిఁ దనివారఁ జూడనిమానవుండు
చూచి తలయూఁచి మెచ్చనిసుజనవరుఁడు
మెచ్చి విరహార్తినొందనిమేటిఘనుఁడు
కలుగఁ డెందైన మూఁడులోకములయందు. 211

క. మదమొదవు కోడెవిటులకు, హృదయపుటాంతరములోన హేమాహేమిక



బదివేల మన్మథులు పు, ట్టుదు రాసీమాటికుచపటుత్వము గన్నన్. 212

వ. అది మఱియును. 213

తే. బిడ్డపాపలఁ గని పెంచు జిడ్డులేక, తిండిచే గండమెండైన దండికతన
నెసఁగు వసగూటిపిసవెట్టి కసరురేఁగి, జారవాంఛావిహారంబు సలుపసాఁగె. 214

చ. విటులకుఁ గొంగుబంగరము వేడుకకొంత్రపుఁ బట్టుగొమ్మయు
త్కటతరమన్మథార్తులకుఁ గల్పగుజంబు భుజంగకోటికి
ఘటితనిధానసీమ యుపకాంతులచేరువపంట జార స
త్పటలికిఁ బంచదార యను దానివిలాస మయారె యారయన్. 215

సీ. కురిమాపుమై సమ్మకరలచీరటువిప్పి, చెలువైనసరిగంచుచీరఁ గట్టు
మెరుఁగంచుకమ్మలు దొరయవంచటుడించి, మణులరంజిల్లుకమ్మలు ధరించు
జిటిపొటిసొమ్ము దీసి మెఱుంగుకట్టాణి, పూసలహారము ల్పొసఁగఁ దాల్చు
గుత్తంపురవికె దా హత్తకుండఁగఁజేసి, కలపంబు కులుకుగుబ్బలను బూయు

తే. నడర బెడగైననిడువాలుజడ సడల్చి
కుప్పె గన్పడ సవరంపుఁ గొప్పుఁబెట్టు
మురియు ముంగిట నిలుచుండి మొలకనగవు
లెసఁగ విటభాగ్యరేఖయా హేమరేఖ. 216

చ. కిలకిలనవ్వుమోవి పలుగెంటుల దీఁటుఁగుచంబు లొరగా
వెలువడఁ బైటఁజేయు నెఱి వింతగఁ గేరు మరుల్కొనంగ బె
ళ్కులు గొనఁజూచు లేనిపగలుంగొని మాటికిఁ గుల్కుఁ గోటిచి
మ్ములు నొనరించు నవ్వెలఁది మోహపుఁ బ్రాయమువానిఁ జూచినన్. 217

సీ. ఏటినీఁటికటంచుఁ బాటిపంటెత్తుక, పలుమాఱు దిరుగు నిబ్బరముతోడ
రోలు రోఁకలి కంచు రూఢిగా నిల్లిల్లుఁ, దిరుగు నేప్రొద్దుఁ దత్తరముతోడఁ
గూరగాయల కంచుఁ గోరి తా బాజారు, కును మఱిమఱి నేగుఁ గొమరుతోడఁ
బనిలేనిపనిజోలి గొని వాడవాడలఁ, జరియించు సారె,కచ్చెరువుతోడఁ

తే. బోలికలసెంచు వలరాచపోగరు నిగుడఁ
గులుకుఁబ్రాయంపు నెఱనీటు కోడెకాండ్ర
గమికిఁ దనజగ్గుజిగిసంచకార మొసఁగి
వలపు శెట్టింప మెలఁగు న వ్వనజగంధి. 218

క. తనకంటికిఁ బ్రియమయ్యెడు, ఘనునొక్కనివెంట నంటి కౌతుక మొప్పన్
మనసంటి కౌఁగిలింపక, చన దింటికి దానిబల్వ్యసన మే మందున్. 219

సీ. ఆగుబోసెడు దాని హస్తంబు రీతిని, గుంచెదీసెడుదాని కొమరుమిగుల

జడచిక్కు దయ్యంబు చందంబునను జెట్టు, విడిచినభూతంబు కడకతోడ
మద్దెలలో నెక్కు మర్యాద నెఱగొట్టు, గనబిల్కు సన్యాసి యనువుమీఱ
వల్లంబుపోనాడు వైశ్యునికేనను, గాలుగాలినపిల్లి క్రమముదోప

తే. గంతుమాయల నుమ్మెత్తకాయఁ దినిన, వెఱ్ఱితెఱఁగున వ్యసనంపు నెఱపువోడమి
చికిలినెఱవన్నెకాండ్రకు సిసముచెత్త, నెనసిచరియించు వీఁట నా హేమరేఖ. 220

క. ఈలీలఁ బురములోపల, మేలౌ ప్రాయంపురూపు మీఱ టగువారిం
జాలి భయ లజ్జ లన్నియుఁ, దూలి చనన్ వెన్నుఁ జఱచి తోలఁగక కలయున్.

వ. ఇత్తెఱంగున. 222

చ. చవిగొని జార వీరగతిసౌఖ్యము దప్పలఁ దేల నెప్పుడున్
దివురుచు మోహవార్ధిని మునింగి యొకానొక కాలమందునన్
శివశివకాంఁపురంబుపయిఁ జింత యొకింతయు లేక చిత్తసం
భవునిజమాయఁ గప్పి కలఁపం దలవాకిట నుండు నెప్పుడున్. 223

శా. ఈమర్యాదను గొన్నినాళ్లు సనఁగా హెచ్చైనకార్యాన్నకై
భూమీశుం డొకనాఁడు పొమ్మనినచోఁ బూత్కారుఁడై యాగతిన్
స్వామీ కట్టడఁ జేసితే యనుచు ఛీ జన్మం బిదే లంచుఁ జిం
తామగ్నత్వముఁ జెంది మందిరములోనం జేరి పెండ్లాముతోన్. 224

వ. అసహాయుం డిట్లనియె. 225

తే. భూవరుం డొక్కపయనంబు పొమ్మటన్న
మంచి దని వచ్చితిని సమ్మతించి నేను
సంబళము కంబళము కత్తి చద్ది చల్ల
డంబు కేడంబు ధట్టి తెమ్మంబుజాక్షి. 226

క. అని పల్కరించినప్పుడె, ఘనకుంతల తోడును వాసెఁ గదరా యని యిం
పొనర నవి యిచ్చి పనిచినఁ, జనె నాతఁడు పయిన మయి విచారముతోడన్. 227

వ. అట్లసహాయుం డరిగినపిమ్మట. 228

క. ఆహేమరేఖ మదిఁ గల, మోహావేశమునఁ దోడిముద్దియతోడన్
బాహాబాహిఁ బెనంగెను, సాహో యని కంతుపాద శహరహిఁ గేరన్. 229

చ. పొలుపగు మావిలేఁజిగురుపొందిక పోఁతపిరంగిలోన నె
క్కొలిపిన పుష్పగుచ్ఛ మనుగుండు పరాగపుమందు నించి వె
గ్గలపుఁబరాక్రమాగ్నిఁ గొని కంతుఁ డనేటిపరంగిభాము గు
బ్బలనెడుదుర్గము ల్పగిలిపార గుభిల్లున నేసి యార్చినన్. 230

క. అటుసేయు మూర్ఛిలి తెలుసుక, కళవళపడి లేచి మనసు గాసిల్లంగా
భళిరా యని వెలునడి తన, నెళవరులను జూచికొనుచు నిలుచున్నంతన్. 231

చ. మెలివడుతీఁగచుట్లు జిగి మించిన పాగ జినుంగుపచ్చడం
బలపడు చల్వదోవతి యొయారపు గందపుఁబూఁతడొల్లుపో
గులు మణిముద్రికల్వలపు గుల్కెడువీడ్యము చంకసంత్రమం
ఘ్రిలతుద ముచ్చెలుల్ వెలయ గుప్తగుణాం డనువైద్యుఁ డొప్పఁగన్. 232

తే. వైద్యమాత్రంబునన కాదు పలుకులనట్టి, నిరుపమాకార సౌఖ్యవిస్ఫురణచేత
నాశ్వినేయులతోనైన నతఁడు వాదు, కెదిరి యోజింపకయె జవాబీయఁగలఁడు.

వ. మఱియు నశ్వాంగధాదిఘృతంబును నైలేయకఘృతంబును షట్పలఘృతంబును దూర్వాదిఘృతంబును బంచగవ్యఘృతంబునునార్ద్రికఘృతంబును గదళీకందఘృతంబునుగళ్యాణఘృతంబును దండులీయకఘృతంబునుగూశ్మాండఘృతంబును మొదలయిన ఘృతంబులు సేయు నేర్పునుబంచాగ్నిచూర్ణంబునుజిత్రకాదిచూర్ణంబును బడబానలచూర్ణంబును మాణిమండచూర్ణంబునుమరీచ్యాదిచూర్ణంబును తాళిసచూర్ణంబును నేలాదిచూర్ణంబును దుంబురుచూర్ణంబును గర్పూరాదిచూర్ణంబును బంచబాణచూర్ణంబును భుగ్వాదిచూర్ణంబును నాదియైనచూర్ణంబు లొనరించుచు నుపమయుం జించిల్యాదిలేహ్యంబును క్షుద్రాభయాదిలేహ్యంబును జతుష్షష్టిమరీచ్యాదిలేహ్యంబును గుసుమార్ద్రాదిలేహ్యంబునుబిప్పల్యాదిలేహ్యంబునుబిల్వాదిలేహ్యంబునుగుండల్యాదిలేహ్యంబును మొదలుగాఁగలలేహ్యంబు లొనరించునైపుణ్యంబును నారికేళాదిరసాయనంబును గుడనాగరాదిరసాయనంబునుశిగ్రుపుష్పరసాయనంబునుజాతఫలరసాయనంబును సుకుమారరసాయనంబునుభల్లాతకీరసాయనంబును సుదర్శనరసాయనంబునువారాహీరసాయనంబును విళంగాదిరసాయనంబునునమృతరసాయనంబును నాదిగాఁగలరసాయనంబులు సేయుపొందిక లెఱుంగువిధంబును శరపుంఖాదితైలంబును లక్ష్మీనారాయణతైలంబునులాక్షాదితైలంబునుధన్వంతరితైలంబును బంచార్కతైలంబునుబాశ్చాత్యనింబతైలంబునువిషముష్టితైలంబును గేతకీతైలంబును స్నేహార్కతైలంబును వాతాంతకతైలంబునుబూతికాతైలంబునుభూనాగతైలంబును భృంగామలకతైలంబును మొదలగుతైలంబుల పరిజ్ఞానంబును నారికేళాంజనంబును సౌవీరాంజనంబును వీరభద్రాంజనంబును నీలాంజనంబును గరుడాంజనంబును గపోతాంజనంబునుగర్పూరాంజనంబును మొదలు గాఁగలయంజనభేదంబులఁగూర్పుచమత్కారంబునునగ్నికుమారకము రాజమృగాంకముబూర్ణచంద్రోదయమువసంతకుసుమాకరము వాతరాక్షసముచంద్రహాసముచంద్రప్రభావతిరసము కందర్పాంకురరసముషణ్ముఖరసము కాలాగ్నిరుద్రరసము తాళకేశ్వరరసముప్రతాపలంకేశ్వరము చాతుర్థికరామబాణమువిష్ణుచక్రరసమువిశ్వంభరరసము బడబానలరసము నారాయణరసముమథన

భైరవరసము భార్గవరసము జ్వరాంకుశము స్వచ్ఛందభైరవము సంజీవనరసము రసభూపతిచింతామణి మొదలైనదివ్యరసౌషధంబులు గంధకరసనాభులలక్షణంబు లెఱింగి యిడుచుప్రావీణ్యంబులును లోహభస్మ తామ్రభస్మ వంగభస్మ సీసభస్మ నాగభస్మ శంఖభస్మ సువర్ణభస్మంబులుసేయుమర్యాదయు శీతభంజి ఆరశ్యాదిమాణిభద్ర తాళీసమాత్రలు గట్టునవధానంబును క్షారద్రావకగుగ్గులు పిష్టకషాయంబులు మూలికలు కైకర్ణకలు సేయు నౌచిత్యంబును సూత్రస్థాన శారీర నిదాన శాస్త్రంబుల పరిచితియును డెబ్బదిరెండు నాడీభేదంబులును వాతపైత్యశ్లేష్మంబుల నుల్బణంబులైన త్రిశతషష్టి రోగంబులకు దత్తచ్చికిత్సలు చేయుచాతుర్యంబును గలిగి రెండవధన్వంతరి యనం బరగు వాఁడు. 284

తే. వీథివెంటను రాఁ జూచి వెలఁదియసిరొ, నౌరయిట్లుండవలదె యొయ్యారమహహ
పినిఁ జిక్కించుకొని మారవిగ్రహమున, భంగపడఁజేయ నిది యేటి ప్రౌఢతనము.

క. అని తనమనమున ననుకొను, చును నిలుచున్నంత వాని సొగసు నొయ్యారం
బును గని మనవిజసమ్మోహనవిద్యను జొక్కి యాతఁ డంచుకు రాగన్. 236

ఉ. ఎక్కడనుండి యెక్కడికి నేమిప్రయోజన ముండి వోయె దీ
వక్కట నామ మే మనిన నన్నియుఁ జెప్పి పరోపకారి రా
యిక్కలకంఠకంఠి యని యెంతియు డగ్గరఁ జేర మారుఁడుం
బ్రక్కలు నెక్కొనం బొడువఁ గైకొను మోహముచేత లేమయున్. 287

తే. అమలశశికాంతకాంత శుద్ధాంతకేళి, కానిశాంతాంతరంబున ఘుమ్మరనెడు
పచ్చబచ్చెన చిత్తరు పనులమించు, ప్రతిమసంఘట్టనల మంటపంబులోన. 288

చ. సకినెలకీలుకంఠమున జాయమెఱుంగులసొంపు కెంపు ము
క్కుకొనల పచ్చరాచిలుక కోళ్లఁ దనర్చిన పట్టుపట్టెయ
ల్లికపయి జాఫరాజినుఁగు లేపునఁ జెందుపలంగుపోషు త
క్కికగలజాలువాగొలుసు గీల్కొనుమంచముపై మహోన్నతిన్. 289

తే. అపుడు గుప్తగుణాహ్వయుం డనెడివైద్యు
నెలమిఁ గూర్చుండఁ బెట్టి యా హేమరేఖ
పండుటాకుల కప్రంపు భాగములను
వేడ్కతోడుత నిడ్డఁడు వేసికొనుచు. 240

మ. సరసాలుం జిఱునవ్వులు న్మరిపెము ల్సయ్యాటము ల్వింతలుం
గరిగింత ల్వలపించుట ల్చతురత ల్కాంక్ష ల్వినోదంబులుం
దరితీపు ల్వలపు ల్మిటారితనము ల్దాటింపులుం దచ్చన
ల్నైఁజదిన్నా ల్మరపించుట ల్సొగసులు న్నటు ల్పచారింపుచున్. 241



సీ. ఆసక్తి దీఱనియాలింగనంబులు, నుసువాంఛ దరగనిచురితవితతు
లనురక్తివాయనియట్టిచుంబనములు, తమివెలిగానిదంతక్షతంబు
లభిలాష లుడుగనియతిచపేటంబులు, తాత్పర్య మెడలనితాడనమ్ము
లాక్షలు మాననిచౌశీతిబంధము, ల్భావ మూననికశౌస్పర్శనములు

తే. కలితకలకంఠకలహంసకలరవములు, పలుకు కిపకిప కపకప ప్రకట టకుట
కకుట కహకహ హసనముల్గళరవములు, చెలఁగ నిద్దఱు రతికేళి సలుపునపుడు.

మ. తెమలను నిన్నుఁ బాసి సుదతీ యని తీయనినీదుమోవి కా
యమృతరసోర్మి యేని సమమా యని మాయనిమోహదాహసం
భ్రమ మెదలోన నెంతదలపా యని పాయనికూర్మితోడి నా
తమిపరభామలందు గలదా యని దాయనికౌఁగిలింపుచున్. 243

వ. ఇట్లన్యోన్యసరససల్లాపంబుల గుప్తగుణుండు సురతకేళికాలోలుఁడై హేమరేఖతోఁ బెనంగుసమయంబున. 244

సీ. కొప్పెరపెట్టుగాఁ గొమరొప్పనొనరించి, పైసుమాలు బిగించి పచ్చడంబు
నాగవల్లీదళపూగపూరితమైన వడిలోన నిడికొన్నయడప మొకటి
చాయలఁ దనరారుసకలాతియొరతోడి, పృథుభుజస్థలినొప్పు పెద్దకత్తి
చీర్ణంపుఁబనిచేత జిగిమించుకరమున, సొంపైన సత్తునున్నంపుఁగాయ

తే. పాదములమెట్లు మొలఁదాల్పఁ బడిన బాఁకు
చల్ది గట్టినవస్త్రంబు చంకగుద్దు
నమర గమనజవోద్భవశ్రమముఁ జెంది
యప్పు డసహాయుఁ డింటికి నరుగుదెంచె. 246

క. అరుదెంచి పురుషుఁ డుండెడి, యరువెంచి నిజప్రసిద్ధి కందఱు నళికే
బిరుదెంచి రోషవశుఁడై, సరిదంచితఘోషభావఁ జానను బిలిచెన్. 245

క. జడియక యిపు డాసతి యే, వడువున బొంకంగవలయు వనరుహగంధీ
యడుగుం దప్పినయప్పుడె, పిడుగుం దప్పననుమాట పేరొకన వినవే. 247

వ. అని. 248

ఉ. ఈవిధి హంసలోకవిబుధేంద్రుఁడు ప్రశ్న మొనర్చి పల్క హే
మావతి కొంతకొంత యనుమానముతో బొటవ్రేల నేలకే
ఖావిధ మొప్ప వ్రాయఁ గుతుకంబున నీ కిది తోఁచెనేని ను
ర్వీవరుఁ జేరనేగుమని వేఁడిన నవ్వుచుఁ బోడి యిట్లనున్. 249

క. నినువంటికతలకారిని, గనివిని యెదువారి నడుగఁ గానలెఁ గా నీ
వనువంటు దానినడిగిన, వినుపింతు నె యెట్లు బొంక వివరింపఁగదే. 250

క. అని యడిగిన హేమావతి, కను రాగం బొప్ప రాజహంసకలాపం
బనియె నసహాయుఁ డటుసలె, ఘనరోషం బుట్టిపడంగ ఘూర్ణించుటయున్. 251

తే. వైద్యుఁ డప్పుడు గడగి పోవఁడకి నాను, బుద్ధియేమనిపల్క నప్పువ్వుఁబోఁడి
వెఱవకు మటంచు దిట్టయై వెన్నుఁజరచి, సంచివిడిపించి యపుడు స్వస్వామికనియె.

చ. కడుపున శూలయొత్తి నడిగాలిని ప్రాణము లేగునట్లయై
తొడిఁబడ నీవులేమి ఘనదుఃఖముచే వెతఁ బొంది యీమహా
త్ముఁడు పురినేగఁ గావు మని తోడ్కొనివచ్చితి నీతఁ డౌషధం
బిడుటను నేను జీవము వహించితిఁ బ్రమ్మఱ నేమి చెప్పుదున్. 253

క. అని యున్న రస్సు రనుచో, నన్నృతోదరి రోగమునఁ బ్రియాంగనపొరలన్
గని కుస్తరించి వైద్యుని, మనమున రంజిల్లఁ జేసి మమత దలిర్పన్. 254

తే. నిబ్బుణము దీర్పఁ గలవాఁడ నేయటంచుఁ
బచ్చడం బిచ్చి బహుమాన మెచ్చ వైద్యుఁ
బంపి సందేహమందక భార్యతోడ
నిండువేడుకనుండె నో నీరజాక్షి. 255

వ. అని మరాళశేఖరంబు చెప్పిన నరాళకచ యగుహేమవతి తనమనంబున. 256

క. సురుచిరమణితాటంక, స్ఫురితప్రభ చెక్కులందుఁ బొలయ శిరంబున్
మఱి త్రిప్పి పొగడె నహహా, గరితలమున్నదియె కాక కలదే పుడమిన్. 257

వ. ఆసమయంబున. 258

తే. మైవియల్లక్ష్మి కస్తూరిమల్లెచీర, రేయిఁ గట్టుక సడలించి రేపటికడ
నుదయరాగంబు దాల్చినయొఱపునొప్పఁ, దమముజాఱంగ సాంధ్యరాగము జనించె.

చ. పలపల నయ్యెఁదారకలు పక్షులు గూయఁ దొడంగె దీపముల్
దెలతెలఁ బాఱె దిక్కులనుఁ దెల్విజనించె బిసప్రసూనముల్
దులగుల విచ్చెఁ దావులకు దొందడిఁ జేరిరి జారచోరులా
మలయసమీరణంబు కడుమందగతిన్ విహరించె నత్తతిన్. 260

తే. తతి యనుకళాదుఁ డుదయభూధరహసంతి
నరుణహేమంబునకు వన్నియలను నిండ
గ్రాఁచి నీరార్చనెత్తినకరడు నాఁగ
సూర్యబింబంబు పొడిచె నవార్యగతిని. 261

క. మణిఘుంటలమొలనూలున్, ఝుణఝుణయని మ్రోయఁ గేళిశాలకు జని య
య్యణుమధ్యన్నృపాల్పితగుణ, గణయై వసియించె దినము కల్పముగాఁగన్. 262



వ. అని ప్రత్యుత్పన్నమతి చెప్పినవిని సంతోషించి నలుండు తరువాతివృత్తాంతంబాన
తిష్ఠుని పలికిన. 263

మ. హరకోదండ విఖండనప్రచురబాహాదండదండాయుధా
ద్యురుదిక్పాలసురాసివార్యతరబాణోద్దండదండాంకభి
ద్ధరిణాక్షీమణిజీవనాకృతినిజా భ్యాఖండఖండాబ్జభృ
ద్భరసాభృద్రిపు వాహసన్నిభయశో భా కాండ కాండోదరా. 264

క. ధారాధరఘృణివారా, వారణరాజన్యవైరి వారణధీరా
ధీరాజిత శుభకారా, కారణపురుషానతార కరుణోదారా. 265

కలహంసోత్సాహవృత్తము.

కలుషదూర భవవిదూర కమలసారలోచనా
కలితహార వరవిచార ఖరవిహార మోచకా
లలితనీరనిధిగభీర లసదుదారకీర్తని
ర్గళితహార శరపటీర ధరసుధారసోత్కరా. 266

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్రపవిత్రాయ్యలరాజాన్వయసుధావార్ధిపూర్ణిమా చంద్ర నిస్సహాయకవిత్వనిర్మాణచాతుర్య నిస్తంద్రిశ్రీరామనామపారాయణనారా యణామాత్యప్రణీతం బయినహంసవింశతి యనుమహాప్రబంధమునందుఁ బ్రథమా శ్వాసము.

శ్రీరస్తు

# హంసవింశతి

## ద్వితీయాశ్వాసము.



శాంకరీశ చాపవి
నాశ ధరాధీశ వంశనలినదినేశా
క్లేశ హరాకాశ దరా
కాశరుచిరాబ్జాభిరామ కాంతియశోమా. 1

వ. అవధరింపుము నలరాజన్యునకుఁ బ్రత్యుత్పన్నమతి యిట్లనియె నట్లు హేమావతి కేళిని శాంతంబుఁ జేరి రాజవిరహంబున నొండొకరీతిఁ బ్రొద్దు గడపుచున్నంత దినాంతంబు గావచ్చిన. 2

శా. ఆహేమావతి మానసాటవిసముద్యద్దీప్తిమైఁ బేర్చుమా
రాహంకారపరాక్రమానలము బాహ్యస్థాన కేళ్యర్థమై
యోహో వెల్వడి పెక్కురూపములచే నొప్పారి కన్పట్టు నా
గేహాంతంబుల దీపపంక్తులు చెలంగెన్ రంగు పొంగారఁగన్. 3

సీ. నును పెక్కు జిగిచెక్కులను మిక్కుటపుఁ డెక్కు, గ్రమ్మెడు పంజుల క్రమ్ములలర
నిడువాలు గలకీలు జడమేలు వగఁ గ్రాలు గొప్పైన సవరంపుఁ గుప్పె దనరఁ
దెలిపువ్వు కళ క్రొవ్వు వెలిరవ్వ చిఱునవ్వు, గలుగు సెమ్మోమునఁ దిలక మమర
రహిఁ గుబ్బలుల నిబ్బరము ద్రొబ్బఁ గలగుబ్బ, కవమీఁది పైఁటఁ జీఅవిళ మెఱయ
తే. బళుకుబళుకున గతులయందళికి బెళుకు, కులుకుఁ గౌనున జాలువాలు కులాలుక
మేటిరెయొడ్డాణ మలరార నీటుఁబూని, పచ్చిరాయంచకడ నిల్చె వనరుహాక్షి. 4

వ. ఇత్తెఱంగున నిరుపమశృంగారతరంగితాంగయై రాజపుంగవసంగమార్గంబరయుచు దన చెంగట నిల్చిన యారాజాననావతంసంబునకు రాజహంస యిట్లనియె. 5



### నాల్గవరాత్రికథ.

క. గమ్మత్తుచిమ్ము నొకకథఁ, గ్రమ్మఱఁ దెల్పెదను వేణిఁ గ్రమ్ము విరులపైఁ
దుమ్మెదలు జుమ్ము జుమ్మనఁ, గొమ్మా తలయూఁచి మెచ్చుకొమ్మా నన్నున్. 6

వ. అని యిట్లు చెప్పఁదొడంగె. 7

క. కలదభ్రంకషకేతన, చలదభ్రం బైన చైత్రశకమనుపురము
జ్జ్వలదభ్రకచాదర్శన, దలదభ్రపురీసుపర్వదారోదరమై. 8

సీ. వేదశాస్త్రపురాణ విద్యాగరిష్ఠులై, విలసిల్లుచుండెడి విప్రవరులు
గరిడిలో నెఱిహొంత కారులై సాముల, మీఱినరాజకుమారమణులుఁ
గోటికిఁ బడగెత్తుకొని యున్న టెక్కెము, లెక్కువై వర్ధిల్లు బేరిజనులుఁ
గడుధాన్యరాసులు గగనంబుతో రాయ, కలిమిచే మించిన కాఁపుప్రజలు
తే. భూమిమదధార లూరెడు వారణములు, ధాటిపాటవమున నొప్పు ఘోటకములు
ఘోరరణరంగపటులైన వీరభటులుఁ, బ్రబలియుండగ వెలయు నప్పట్టణంబు. 9

క. ఆపట్టణంబులోపలఁ, జూపట్టును దంతువాయ చూడామణి రే
ఖాపట్టభద్రుఁ డెసిరి, నేపట్టున నొరపొర మింతయు లేకన్. 10

సీ. కుంచె మగ్గపుగుంత గూటంబు పగ్గంబు పరిపెట ద్రొక్కుడుపట్టె పలకదోసి
పరిపరియచ్చులు చరికుండ యూడిత, చీడుదబ్బలు దండె వాడె కోవి
కోఁతిపుల్లలు నాల్క కుడుతక్కొయ్యలుఁ జొప్పయూచలుఁ గోఁత చూరుకత్తి
కొరంపుఁ బడుగులు గండెలకప్పెర, గోలము లాకలు నిలికడవ
తే. గంప డొల్లకళాసంబు కదురు చెమికె, నూలురాట్నంబు జాలంబు గ్రాలుగ్రోడ
వఱల నాశుభభద్రు నివాసభూమి, యప్పురంబున సంతతం బొప్పుచుండు. 11

తే. గొప్పకన్నులు చిఱునవ్వు గులుకుమోము బవరిగడ్డము చక్కనై పరఁగు ముక్కు
నెగుభుజంబులు విపులత్వ మెసఁగు రొమ్ము, జిగిమిగులులీల గనుపట్టుఁ దొగటసెట్టి.

ఉ. అఁటది నేర్పుతో నగల యందముఁ జందము జూపఁ బూని కో
లాటము వేయుకై వడిని లాలితదృక్తరళప్రభావళుల్
పాటిఁగ బోఁగు వెంబడిని బార్శ్వములం జరియింప వస్త్రముల్
ధాటిగ నేయు నప్పులుక తట్టున బెట్టు ఖణిల్ ఖణిల్లనన్. 13

తే. అరవిరుల తేనియలచాలు మరునివాలు, మిసమిసలప్రోలు పలరాజు మేటిడాలు
మురిపెముల మెచ్చుకొనఁ జాలు ముద్దరాలు వానియిల్లాలు దొమ్మర వానిడోలు. 14

ఉ. దానిముఖప్రభాగరిమ దానికపోలకళావిశేషముల్
దానికడంగుచూపులును దానికుచంబులఁ బొందునందముల్

దానివచో విలాసములు దానికచారిరుచుల్ గణింపఁగా
మానవతీలలామ విను మర్త్యులమర్త్యులు నైన శక్తులే. 15

క. జిగిఁజిలుకు కులుకుగుబ్బలు, నిగనిగలు చెలంగు నెఱులు నిద్దపుఁ గన్నుల్
నగవు దళుకొత్తు మోమును, మగువా యాబిడకె కాక మఱికలదటవే.

క. తొడలందము కటిచందము, నడుగుం దమ్ముల బెడంగు నాస్యము రంగుల్
జడతలుకుల్ మెడకులుకు, న్నడబెళుకుం జూడ నాఘనస్తని కమరున్. 17

తే. చిన్నచీమల నునుబారు చెలువయారు, గదలికాకాండములమీఱు కొంతయూరు
లందముల జెందు రతిఁగేరు నతివసౌరు, దాని కెనయైననారు లిద్ధరణి లేరు. 18

క. కందర మాచెలి పొక్కిలి, కందర మావీనసనంబు కచము రదంబు
ల్కుందరమానసములు నా, కుం దరమా పొగడ నలకు కుందరనుకటిన్. 19

సీ. మిళదంబుజలదంబు బలుడంబుచెలుడంబుఁ, దులకించు నమ్ముద్దు కలికి వేణి
సిరిపట్టు గలిగట్టు జిగిగుట్టు వెలిఁబెట్టు, చెన్నారు నక్కన్నె చన్నుదోయి
నునుకందు పైఁ జెందు నని యిందురుచి గ్రందు, పఱపఁగాఁ జాలు నబ్బాలమోము
తెలిదమ్ములను గ్రమ్ము కళజిమ్ము ననయమ్ము, మిన్నయౌ నబ్బోటి కన్నుఁగవయుఁ

తే. దావి తేనియ బావియందముల దీవి, మావిచిగురాకు చెంగావి మారుఠీవి
కప్పురంబుల కోవి యక్కాంత మోవి, యనుచు వినుతింపనా నేత వనితయలరు. 20

తే. పరిమళ మెనంగు బంగారు ప్రతిమవంటి, తొగట వాల్గంటి జిగినిటు తొలకరింప
సొగసుకాండ్రకు మోహరాసులు జనింప, నూరయొక యోరఁ జెలువార బారసాచి.

సీ. పోఁగు వెంబడిఁ బర్వి పొల్చు వాల్చూపుల, ధళధళ ల్పావడంచ కళలనీనఁ
బుంజంపుకట్లు దెం పుటకుఁ బన్నిత్తుచో, మట్టెల ఖణఖణ ల్బెట్టు మొరయ
గీలెత్తుచో బాహు మూలజాతప్రభా, చకచకల్ పైఁడి వసంతమాడ
బరిటఁ ద్రిప్పఁగ జాఱు పైఁటలోఁ గన్పట్టు గుబ్బలమిసమిస ల్దొరిబ్బులాడ

తే. వింతవగకప్పు నెఱిఁగొప్పు వీట మెఱయు, నిగనిగ ల్జాతినీలాల నిగ్గునింపఁ
గుచభరంబున నడుము కొంకుచు వడంక, నూలుదోఁడును వేడ్క నవ్వాలుఁగంటి.

చ. కరములఁ గంకణాలి ఘలుఘల్లన రాట్నము ద్రిప్పువేళఁ బైఁ
టర దిగజాఱి వెల్కుఱుకు నబ్బురపుల్ వెలిగబ్బిగుబ్బపై
సరులిసుమంత చిందుగొనఁ జిక్కని చూడ్కులుఁ జూచువారి పే
రురమున గాడ నవ్వాలఁది యోర్పునఁ గండెలు చుట్టు నేర్పునన్.

ఆ. పడుగుఁ జేయువేళఁ బటము లల్లెడువేళఁ, గూడు దిసెడువేళఁ గూర్కువేళ
మగని కన్నొరంగి మార్గ్గలను గూడు, నింటిపొరుగుసఖుల యిండ్లలోన. 24

క. గడిదేఱి జారవిద్యకు, వడిగట్టి దురంతకంతు వనజశరాళిన్



బడఁజాలనిక్షతమున నా, యెడువున నత్తొగటబోటి వర్తిలఁదొడఁగెన్. 25

వ. ఇత్తెఱంగున నత్తెఱవ చిత్తజాయత్తచిత్తయై వర్తింపుచున్న సమయంబున. 26

సీ. నొసలిపైఁ జుక్కల♦మిసిమి నామపురేఖ, లనువొంద భుజముపై♦నసిమి సంచి
వాలువీనులగాజు♦నీలాలపోఁగులు, పైనొప్పు పప్పళి♦పచ్చడంబు
మెలిగొనఁ జుట్టిన♦తలపాగ చెఱఁగుంచి, పైటపేటాచుట్టు♦పట్టుశాలు
కడిఁదిమీఱఁగఁ జంక ♦ నిడినబొట్టియకోల, డాకమోసెడుడుబు♦డక్కకేల

తే. వఱల దిక్కుల నెంచి దు♦ర్వారమైన, కీడు మేలును దెల్పుచుఁ ♦ గేళలిడుచుఁ
గొర్లికొనుమను దనపేరు ♦ కేరికొనుచు, వచ్చె నచటికి డుబుడక్క♦వాఁడొకండు. 27

ఉ. అడుబుడక్కవానికి ర♦యంబున భిక్ష యొసంగ నేఁతపూ
బోఁడి ప్రకోష్ఠకస్థలికిఁ ♦ బోయి తనుం గొనియాడువాని నా
మ్రేడితసూక్తిపైఁ బెదవి♦మీఁదను లేనగ నంకురించి చిం
దాడఁగ ముష్టిఁ బెట్టి బహి♦రంగణభూమిని నిల్చి యుండఁగన్. 28

సీ. మెలిఁబెట్టి చుట్టిన ♦ తెలిపైఠిణీపాగ, చెవిసందిపొగలోఁ ♦ జొక్కకలముఁ
దొడిగిన నెఱచల్వ ♦ నడరు నంగిజోడు, జీరాడునడికట్టు ♦ చెఱఁగుకొనలుఁ
బదతలంబుల నెట్టు♦పాఱుపాపోసులు, టెక్కుగాఁ జంకఁ జీ♦ట్రీఖలీతి
నడికట్టులో మొల♦నిడినకలందాను, హస్తాగ్రమున వ్రేలు ♦ దస్తరంబు

తే. మించుబాహువుమీఁదఁ గా♦శ్మీరశాలుఁ, జెవుల ముత్యాలపోఁగులు♦ చెలువుదనర
కలఁతి నిర్వాకవిదోపతి♦యమర నటుకుఁ, బారుపత్యంబు సేయు వ్యా♦పారి వచ్చె. 29

తే. వచ్చుచుండెడి వ్యాపారి ♦ పెచ్చువగలు
మెచ్చి యచ్చెలి తమి హెచ్చి ♦ రచ్చ సేయఁ
బగటువగమీఱఁ గోర్కులు ♦ బారుదీరఁ
బొగరుఁ జూపులతోఁ బడా♦వగలఁ జూచె. 30

ఉ. చూచినయంతలో మరుఁడు ♦ చొక్కపుఁ గప్రపుటాలపుంటలన్
లేఁజివురాకుఁ గ్రొవ్వి నల♦లేమ పయోధరచక్రవాకముల్
వే చలియింప హృత్పుటము బీటలు వారఁగఁ జెప్పు తెప్పునన్
గోచునదాఁక నూఁది మది గోలుపడన్ బడి నార్చి వ్రేసినన్. 31

క. ఊహలు కుత్తుకబంటై, మోహము తలమునుఁక లగుచు ముద్దియ మదిలో
బాహాబాహి కచాకచి, హూహాక మతిపట్టి పెనఁగి కో యనుచు వడిన్. 32

తే. అంత నయ్యింతి యింతంత యనఁగరాని
వంత మదిఁ గొంత చింతించి కంతువిశిత
కుంతహతి కోర్వలేక దినాంతవేళ
మంతనంబున వెడలి గేహాంతరమున. 33

చ. ఉరిసినపల్లవెండ్రుకలు నూడినదంతము లంబకంబులం
గురిసెడు బాష్పజాలములు గూను వడంకెడు మస్తకంబుఁ గం
థరఁ దగు తోలు పాదములు దర్శనము ల్వడి చీరపోఁగునూ
త్తైరసెడు మంత్రసానిఁ గని మించెడువేడ్కఁ నుతించి మ్రొక్కినన్. 34

ఆ. అలకించి లేచి యది యెవ్వ రని చీరి, యమ్మ నీవఁటే య టంచుఁ బొదవి
యేమిపనికి వచ్చి తీసందెవేళల, ననుచు నడుగఁ దొగట వనిత పలికె. 35

ఉ. అరయ నిమ్మహాపురికి హాసము మీసము మీఁదఁ జిల్కఁ వ్యా
పారి యొకండు నిండు రతి భర్తను బోలినవాఁడు వచ్చెనే
సారసికాగ్రణిం గదియఁ నాస వహించితినమ్మ వానితోఁ
గోరినపొందు నాకు నొనఁ గూర్చిన నీ కొనరింతుసంపదల్. 36

సీ. నవరైన రతనాల బవిరెకమ్మల నిత్తు, నవి నీకు మనసురా నంటివేని
యాణిముత్యమ్ముల హారమ్ము లొసఁగుదు, వానిపై నీ కిచ్చ పూనదేని
గరుడపచ్చలకీలు కడియంబులర్పింతు, నందుకు నీయాస చెందదేని
తళుకుఁగెంపులసంది దండలు చెల్లింతు వానిపై నీబుద్ధి యానదేని

తే. నూసకము తీఁగ మెడనూలు సొబగునాను
గుండ్లపేరును గైకొన్కఁ గోరిసేతు
నమ్మ నావిన్నపంబు నీ వాలకించి
వాని ననుఁగూర్చు నీ నేర్పు పూని మెరసి. 37

మ. అనుచుఙ్ వేఁడిన మంత్రసాని విని నెయ్యం బారఁగాఁ బల్కె నో
నవబోఁడీ నినుఁ జూడ మన్మథునకైన న్మోహము ల్పుట్టఁగా
మనుజుం డీతఁడు భీష్ముఁడో సనకుఁడో మౌనీంద్రుఁడో వ్యాసనం
దనుఁడో యెంతటివాఁడు వీఁ డనఁగ బం దాకోరుఁగాఁ జేసెదన్. 38

క. సొనయందు రసముఁ బసరును, ఘనమణిమంత్రౌషధములఁ గైకర్ణికకా
వును మొగసిరి క్రియ బంతిబ, దనిక గుళికమూల్కె బూతిఁ దవిలిచి తెత్తున్. 39

వ. అని చెప్పి వీడ్కొల్పిన. 40

క. తనయింటికి హేమంతిని, చనె నానిశిఁ గడపి మంత్రసాని రహస్యం
బునఁ బొరుపత్తెగాఁడుం, డిన చక్కికిఁ బోయి మ్రొక్కి నిపుణత మెఱయన్. 41

సీ. దాక్షిణ్య మనురక్తి దయయు విశ్వాసంబు, బాంధవ్యము హితంబు భయము భక్తి
యంతఃకరణము సఖ్యంబుఁ బోరామియు, నేస్తంబుఁ జెలిమియు నెనరుఁ బ్రేమఁ
జల్లఁదనంబు వాత్సల్యంబుఁ గలుపుఁ గో, ల్తనముఁ బ్రీతియు మంచితనము మైత్రి
ప్రాణపదంబుఁ దాత్పర్యంబు గారాబ, మనుగుణ్య మనుబంధ మనుసరింపు



తే. మచ్చికయు జొట్టరిక మైక్య మిచ్చకంబు
స్నేహ మనురాగ మాసక్తి మోహనియతి
సలిపి కడుఁ దక్కఁ ననిపించి సొలయఁ జేసి
వెగడుపడ కప్పు డాత్మప్ర వీణమహిమ. 42

చ. స్తుతులు ప్రసంగము ల్కథలు సుద్దులు వార్తలు రాచకార్యముల్
చతురతలేతిహాసములు శాస్త్రములం దగుజాతిగాథలుఙ్
సతకడము ల్పురాణములు సామెతలుం బరిహాసకంబు లిం
గితములు జారజారిణుల కేళిచరిత్రముల న్వచించుచున్. 43

ఉ. దేవపరాకు హాసనుకళ దేలెడు నీదగురూపవైభవం
బేవిధినో కనుంగొనె ర తీచ్ఛనుఁ బొల్పడి చిక్కి సొక్కి నీ
సేవయు చేయఁ గోరి నిను శీఘ్రమె రమ్మని చెప్పి పంపె నో
భావజరూప యాతొగట భామిని కామవికారచిత్తయై. 44

తే. హత్తుకొనవచ్చు నీవంటి యందగాని
కట్టిముద్దులగుమ్మను గుట్టుతోడ
ననిన మన సిచ్చి మదిలోన హర్ష మెచ్చి
మంత్రసానికి విడె మిచ్చి మమతతోడ. 45

క. ఆపనులకె యేఁకారెదు, తాపము గలవాఁడు గనుకఁ దగ నాతఁడు ని
క్షేపముఁ గనిన దరిద్రుని, యేపున ముద మంది దాని కిట్లని పలికెన్. 46

ఉ. అచ్చటి కేను వచ్చునమ యం బగు వేళ యెఱుంగఁ దెల్పనఙ్
ముచ్చట దీర్తునంచు మది ముద్దియతో వివరించి పంపఁగా
నచ్చెలి తంతువాయకుల టాంగన చెంగట నీ ప్రసంగముల్
చెచ్చెరఁ జేయ నత్తఱిని చెట్టిదుకూలము లమ్మువేడుకన్. 47

సీ. కలసమీపపుటూళ్ళ కాఁపుగుబ్బెతలని, మ్మళికి నాకర్షింప మంత్రవిద్య
బచ్చుఁ బ్రాయపున్నృషభవ్యూహముల నెల్ల, వఱలంగ గుమిగూర్ప వశ్యత్రాడు
చిల్లరసరకుల సెట్లబేరాల కిం, పుగ లాభ మొందింపఁ బూఁటకాఁపు
వెనుకోలుకాండ్రకు జనసమూహంబుల, గణితిచూపెడు నాయకప్రభుండు

తే. ముద్రగరిటియు భుజముపై మొనయఁ బెట్టి
ఘంట ఖం గని మ్రోయ నం గళ్ళఁ బడిని
మరిగి తిరుగు సళాదికి మణియకాండ్ర
కవనిబడికాఁపు సాలింత నలరు నంత. 48

క. అంతట నాసంతికుఁ దన, కాంతుఁడు వస్త్రమ్ము లమ్మఁ గా నేగిన హే

మంత్రిని వ్యాపారివిటో, పాంతమునకు మంత్రసాని ననిపిన నదియున్. 49

తే. పోయి సమయంబుఁ దెల్ప న బ్బోటిఁగు వేడ్క
వింత నెఱపూఁత గందంబు విరులు సరులు
కప్రఁపువిడెంబు జిగిచెల్వ గలుగు సొగసు
దనర హేమంతి యిలు సేరెఁ దత్క్షణమున. 50

ఉ. చేరినఁ దంతువాఁడుసతి సిస్తుగ నిస్తులరత్నవస్తువి
స్తారసువర్ణపర్ణముల సంపద లిం పొనరించు కేళికా
గారములోన దివ్య మగు కమ్మనితావుల హంసతూలికం
జేరిచి మేర మీఱుతమిఁ జీరగ మాయనిపోరి కయ్యెడన్. 51

చ. త్వరపడి గబ్బిగుబ్బ కడ వాఁడినఖంబులఁ జీఱి చీఱి పై
సిరితళుకొత్తుతేట నునుఁ జెక్కులు ముద్దులు పెట్టి పెట్టి వా
తెఱ మొనపంటికొద్ది కసి దీఱఁ జుఱుక్కున నొక్కి నొక్కి యీ
కరణిఁ బరస్పరంబు జయ కాంక్షఁ బెనంగఁగ నింతి పైకొనెన్. 52

సీ. చిటిలెడుగందంబుఁ బెటిలెడుకస్తూరి, చలియించురత్నకుండలయుగంబుఁ
గదలెడునెఱివేణి వదలెడుపువ్వులుఁ, జెమటఁ గరంగుకుంకుమపుఁబొట్టు
వికసించుకన్నులుఁ బ్రకటించుమణితము; ల్గంకణఝణఝణత్కారరవముఁ
బొదలెడుచనుదోయి కదలెడుహారము, ల్ఘననితంబాఘాత నినద మధర

తే. నిటలసంచలదలక ముత్కటనఖాంక
మమితవిశ్వాసమారుతం బతను గేహ
దర్పనోత్సాహిపతిచపే టప్రదాయి
యైనపుంభావసురత మయ్యతివ సలిపె. 53

వ. మఱియు నయ్యుపరిసురతంబుతమి యెక్కువయై దృఢకుచాశ్లేషణంబు విడువఁ జే
యంజాలక శీతకాలంబును బ్రకటీకృతతారకంబును సంశ్లిష్టప్రియతమంబుఁగావున
నిశాసమయంబును సంచలితపయోధరంబును నిర్గళితకృష్ణవేణ్యాదికమలంబుఁ గావు
న శరత్కాలంబును బల్లవరాగసంపాదకంబును గలకంఠకూజితంబునుం గావున
వసంతకాలంబును ధ్వనిప్రధానంబును గలితవిశ్రమంబుఁగావున సత్ప్రబంధంబును
గళితవసనంబును బహుబంధబంధురంబును గావునఁ బ్రబుద్ధసిద్ధమార్గంబునుఁ బోలి
వెలయుచుండె. 54

ఉ. ఆసమయంబునం జెమట లాస్యముఁ గప్పగ నిండుబల్మిక
ల్గా సిలఁ జేయఁగాఁ గబళి కాంక్షకు జీవము వేగురింప ని



శ్వాసము బాయకీర నిజ వల్లభుఁ డౌ శుభభద్రుఁ డట్లు సం
వాసముఁ జేరవచ్చి తల వాకిలిఁ దీయని పిల్చె వల్లభన్. 55

తే. అప్పు డేరీతి నుపనాథు నవల కనుప, సుందరీ యేయుపాయంబుఁ జూడవలయు
జాణ వౌదువు జారవాం ఛలకు నైతె, తెలుపుమనిపల్కెఁ గలహంస దేవవిభుఁడు.

క. అని యడిగిన హేమావతి, విని దీర్ఘోచ్ఛ్వాస మొనర విడిచి నిజాంఘ్రిం
గనుదృష్టి నిలిపి మెల్లన, మునివ్రేల న్నేల గీచి మునుకొని పలికెన్. 57

క. తెలియ దెటుపనుపవలెనో, పలుమఱు నే బ్రహ్మలోక పర్యంతంబుం
గలయ విచారించి చూచితి, నలవడ దది నీవె తెలుపు హంసవిభో జా. 58

క. అని యడిగిన హేమావతి, కనురాగం బొప్ప రాజహంసం బనియెన్
వినుము నిజాధిపు డటువలెఁ, దనుఁ బిలిచిన యువతి లేచి తరలక ప్రీతిన్. 59

క. పిలిచిన గుండె లొటుక్కనఁ, గలఁగుచు వ్యాపారి వెడలఁ గానెటు లనుచున్
దలఁచినచో వెఱవకు మని, నిలిచిన దార్ఢ్యమున మానినీమణి వేడ్కన్. 60

ఉ. అత్తఱి బిత్తరై ఘనము దాత్తసుచిత్తపు మత్తుపొత్తుతో
బిత్తరి తత్తరింపకయ పేర్కొని వాకిలి దీసి వేగమే
చిత్తజువంటినాయకుని చెంతను నిల్చి తదీయనేత్రముల్
మెత్తనిచేత మూసి దయ మించఁగఁ దోడ్కొనివచ్చెఁ జెచ్చెరన్. 61

ఉ. ఆవగఁ జూచి యవ్విటమహామకరాంకుఁడు చిత్తవీథిలో
నావగమాన మానిని నయం బొదవం గనుసైగచేసినం
దా వగు చోటి కేగెఁ దదనంతర మత్తులివేల మూసి తే
పోవఁగరా దటంచుఁ బతి ముద్దియ నిట్లడిగెం బ్రియంబునన్. 62

తే. అటుల నడిగినప్రియభర్త యంబకముల, మూఁత చాలించి యామించు ముద్దుగుమ్మ
సిగ్గు కడ్డంబుగాఁ బతిచేల మలమి, కొనుచుఁ బలికెను జిన్నెలు కొసరు చూప. 63

చ. జలకము లాడఁ గోరి బురుసావని చీర సడల్చి సందులో
పలికిఁ జనంగ నీదు నునుఁబల్కు వినం బడఁ దల్పుఁ దీయఁగా
వెలువడి వచ్చితిన్ వలపు వెల్లువ దొట్టఁగ నంచు నాయకుం
గులుకుమిటారి గబ్బిచనుగుబ్బల గౌఁగిటఁ జేర్చి పల్కినన్. 64

తే. భామ తనమీఁద నెవ్వరైన బాగుఁ జూచి
చిత్తము గరంగి శుభభద్రశేఖరుండు
గుణవతి వటంచుఁ బ్రియురాలిఁ గుస్తరించి
నిండుమోదమ్మున సుఖాన నుండె నపుడు. 65

క. ఇంతయుపాయముఁ గలిగిన, నింతీ చనవమ్ము జారు నెనయఁగ లేదా

కాంతుఁ డెఱింగిన నృపమణి, చెంతను నేమొగముతోడఁ జేరెదొ చెప్పుమా. 66

తే. అనుచు రాయంచ నుడివిన విని శిరంబుఁ
ద్రిప్పి హేమావతి ప్రమోద మొప్పఁ బలికె
నౌనె మజ్ఝారె యదిగాక యాఁడువారి
తల్లి యనుచును జిరునవ్వు దలకొనంగ. 67

క. తెలవారె నపుడు దీపపుఁ, గళికలతో వెల్లఁ బాఱఁగాఁ దనమోముల్
భళిర కథాలాపం బని, జలజేక్షణ చనియె కేళిసదనంబునకున్. 68

చ. చని జలజాప్తుఁ డస్తగిరిచాటున కేగినయంత మజ్జనం
బొనరిచి వ్రాఁతపుంబనుల నొప్పు దుకూలము గట్టి రత్నకాం
చనమయభూషణంబులును సారపుమేల్తిలకం బమర్చి ఘు
మ్మనువిరు లూని యచ్చెలి నృపాగ్రణి చెంగటి కేగుచున్నెడన్. 69

మ. కని చంద్రాంగబిడౌజుఁ డిట్లనియె శృంగారంబు లెస్సాయె మే
ల్దనరారెన్ భళి హేమంతకారివిగదే తన్వంగి రాజాంతికం
బునకుం బోయెద వేమొ యొక్కకథ యొప్పం దచ్చమత్కారము
ల్వినిపోనిల్పిన నంటిపండ్లనె నవుల్ ప్రేయించు మంత స్వైసన్. 70

క. అన విని హేమావతి మో, మున నవ్వు జనింపఁగతలమునిపుట్ట సుమీ
కన నీదుకడుపు బ్రహ్మకు, వినఁ దరమా యనుచుఁ బలికి వినుపింపు మనన్. 71

క. కప్పురపుఁదునుక లలవడ, విప్పుగ విరి తేనె వాన విడివడి కురియం
జొప్పడర హంస నరపతి, చెప్పెను హేమావతీకుశేశయముఖికిన్. 72

---

## అయిదవరాత్రికథ.

క. అలింపు మహాభ్రంకష, కేళీప్రాసాదనీలఘృణిగాఢతమః
పాళీ సతతవిహారిసు, రాళీ పురజాలకులట్టమై సర మనఁగన్. 78

తే. పుర మొకటి యుల్లసిల్లు సంస్ఫురితపూర్ణ
మానిశాకరధిక్కారిమంజులాస్య
యందు నొకగొల్ల సంపల్లతాంగి పిల్ల
విజయుఁ డనుపేర నిరులచే వెలయుచుండు. 74

సీ. కంబళితలగుడ్డ కవ్వము మజ్జిగ, బాన గొడ్డలి నుచ్చు పాఁతలగుది
కావడి యుట్లు చిక్కము సందికడియంబు, నూకలతోఁప పాగాకత్తి
బొప్పి మజ్జిగముంత బొటమంచిపిల్లల, గూడు దామెనత్రాడు కోఁతకత్తి
తొల్లగట్టెయుఁ జలదుబ్బచిల్కుడుగుంజ, బూజబిందెలు వెన్నపూసచట్టి



తే. పాలబుడిగలు వడిసెల ప్రాఁతమెట్లు
మలిపపందులపాడి బుఱ్ఱ మన్నెముల్లు
తోలుకుళ్లాయి తొడుపును దొడ్డికంప
చుట్టు చవిరెయుఁ గొమరొప్ప సొలయు నతఁడు. 75

చ. కుఱుబలిదోరచారనలగుం డ్లెఱగొండిలిమాలబొల్లివిల్
నఱిగివి నెట్టుజోడు ఫులి నల్లని వెఱ్ఱవిపుల్ల చిల్లవిల్
బఱిగివి మొఱ్ఱవిల్ గరకపల్లవి నాఁదగుపేళ్ల నొప్పెడుల్
గొఱియలు వేనవేలుఁ గలగుంపు లసంఖ్యము లుండువానికిన్. 76

తే. బోడ పొడమట్టినామంబు బొల్లిపూరి, జాలనల ఫుల్లవెరబట్ట నారబరగి
కఱుకుగడ్డము తెలిమొఱ్ఱ గొరదోర, పనెడుపేరుల మేకగుం పతనికుండు. 77

తే. మట్టె చేమటె కరపన్నె మైలబట్ట, కోరతలపూజ దెఱ్ఱనిచార బోడ
పొడకపిలకన్నె బొలిచుక్కపుల్లవియను, పేళ్ల నొప్పారిమందలోఁ బెక్కుగలవు.

క. పల్లవి నల్లవి యెనుములు, ఔల్లల నిడుగోడిగలునుఁ బెంపుడు పెదపొ
ట్టెళ్లును దుక్కిడ్లును వెల, సిల్లఁగ నావిజయుఁ డచట నిస్తుగ నుండున్. 79

క. అతనికి మంజుల యనఁగా, సతియొక్కతె గలదు దాని సరి యెన్నుటకుం
గొతుకుపడు రతికిఁ జతురత, యితరుల నేక నెన్న నేల యిందునిభాస్యా. 80

క. అకులుక్కు లాయొయారము, లాగనుదమ్ముల మెఱుంగు లాగౌను బెడం
గాకుచయుగ్మము బింకం, బాకోయిలముద్దుఁబల్కు లతివకె చెల్లున్. 81

క. ఆబిడ గరోభత్ప్రవృత్తికి, నై బగిసియు మాలి పతిరతాదృతిమీఁదన్
లోఁ బొడమిన రుచిమించినఁ, బ్రాబల్యము గలుగు విటులపా లిది యయ్యెన్.

సీ. వేశ్యాపతిచకోర విసరంబులకు నురి, విట మృగావళికి లవిత్రకంబు
యువరాజికరులకు నొనరారు నోదంబు, కాముకవ్యాఘ్రింపు గమికిబోను
పాంథమానసమత్స్య పటలికి గాలంబు, పల్లవోత్తములకు నల్లెత్రాడు
షిద్గకపోతరాజికిఁ జేర దీమంబు, లలిభుజంగవిహంగములకుఁ జివురు

తే. జారకీరిపంక్తులకు మోటు సరసశలక, ములకు గట్టువయుపకాంత ముఖ్యచటక
సంఘములకును గుబ్బికళంబరారి, ఘోరరణహారి జయభేరి ఘోషనారి. 88

తే. ఇత్తెఱంగునఁ జిత్తజాయత్తచిత్త
వృత్తిఁ గైకొనిఁ జారులపొత్తు సలిపె
నలసటయు వేసటయు లేక యటుల నయ్యుఁ
జాలు గాంచఁగ లేక యాసుదతి గుంది. 84

చ. తిరుమలకంచిపుష్పగిరితీర్థములుం జని కొంగుముళ్లతోఁ
వరములు దంపతు ల్వడయ వారికిఁ గాన్కలు వైచియంతటన్
బరికలు దృష్టిదీపములుఁ బన్నినగద్దెలు పెట్టి యేమిటన్
గర మగు పుత్రవాంఛకడఁ గానఁగలేక విచారఖిన్నులై. 85

వ. ఉన్న సమయంబున. 86

ఉ. కొమ్ములు వీరణాలు జిగిగుల్కెడుప్రాఁతలకృష్ణలీలలం
గ్రమ్ముగుడార్లు వీఁడగు కాటమరాజుకథానులాపముల్
బమ్మినపుస్తకాలు ముఖపట్టికకట్టురుమాలలున్నెడా
సొమ్ములు నామము ల్వెలయ సుద్దులగొల్లలు వచ్చి రంతయున్. 87

వ. ఇట్లు వచ్చి. 88

సీ. ఘెళఘెళవీరణాల్ ఘళిపెళివాయించి, పోటుబో కొమ్ములు నాట నూఁది
వానకొండగంగను వాలుత సన్నుతిచేసి, కృష్ణున కతిభక్తిఁ గేలుమోడ్చి
యాదికాలపుగొండ్ర నందఱఁ గొనియాడి, తాతతండ్రులపేళ్లు దలఁచి పొగడి
బిరుదుల నరుదుగాఁ బేర్కొని మొఱయించి, దీవించి వీరుల త్రోవలెన్ని
తే. కులము పెద్దలకథ లామికొనఁగఁ జెప్పి, సివము పుట్టించి పుత్రులఁ జెందఁగలరు
వీరులను గొల్వుఁ డని తెల్పి వీడుకొల్పఁ, జనిరి సుద్దులగొల్లలు సంతసిల్లి. 89

వ. ఇట్లు వారలు చెప్పిపోయిన నత్యంతభక్తిప్రియపూర్వకంబుగా నంతట. 90

మ. కొలిచెంగాటమరాజులన్ నతులు చేకూర్చన్ మహావీర్లకుం
బొలములన్ రాజుల నెంతభక్తిపరతం బూజించె నాగంగకున్
వెలయన్ వేటలు బోనముల్ సిడులు గావించెన్ సుతోత్పత్తికై
చెలి యాలాగున నల్ప దైవముకృపన్ సిద్ధించెఁ దద్వాంఛయున్. 91

వ. అంత. 92

ఉ. మోము వహించెఁ దెల్వి జిగి మోవిరుచుల్ దగ సందడించె మృ
త్స్నమతి మించెఁ జన్మొనలు శ్యామలకాంతి వహించె యానముల్
జోమలు మందగించెఁ గడుపృద్ధి భజించెను గౌను చిట్టుముల్
రామకు సంభవించె నభిరామతరంబుగఁ జీరచిక్కనన్. 93

తే. అంత నొకనాఁడు శుభముహూర్తాంతరమున
మంజులాంగన రంగైన మంచిమణుల
నొఱపుగాఁ దీర్చి కట్టినయొక్కదివ్య
మందిరములోనఁ జిన్నికుమారుఁగనియె. 94



చ. పడఁకెడుకాను రంగుతలపాగెనగట్టినకొంగు పుక్కిటన్
విడియపుఁజొంగు మైలఁ గొని వ్రేలెడుచేలచెఱుంగు పాలచే
పుడుచనుదోయిపొంగు వసపూసలవింతబెడంగు నూనెక్రొ
మ్ముడిరుచి చుక్కబొట్టమర ముద్దియ యొప్పెను బిడ్డకాన్పునన్. 95

వ. అంత. 96

క. అది ప్రతిపచ్ఛశిరేఖా, భ్యుదయమువలె దినదినమ్ముఁ బొదలెడుకళలం
బొనువంబడి తేఁబ్రాయపు, మద మెక్కఁగ ముద్దుగులికె మనముల రారన్. 97

క. చన్నులపస యటుసిఁదటఁ, గన్నులపస ముద్దుగులుకఁ గలముఖమున మే
లొక్కక్రొన్నెలమిస జిగిబిగివగ చిన్నెలమస చూచి నిలచుఁ జిత్తజుఁడయినన్. 98

తే. తమకమున కొగ్గి దనెడు నేరము ఘటించి
తరుణతను వెళ్లఁ గొట్టింపఁ దలఁచి మదనుఁ
డీర్ష్యగుండలు వెళ్ల వేయించె ననఁగ
బాల్యము చనంగఁ గుచము లేర్పడియె సతికి. 99

తే. కొమరెపాక్కిలిబంగారుకుందె యందు. రతియు శృంగార మనుధాన్యరాశి నించి
దంచ నిడినట్టిరోకలి సంచుమీఱి, రోమరాజి దనర్చు నారూఢిగాఁగ. 100

క. చెందిర మా మెయిసిరి సిరి, మందిర మా మోము గోము మదనారిలస
న్మందిర మా కుచయుగ మిం, దిందిర మా వేణి యనఁగ నెలఁత రహించున్. 101

సీ. రాణించు నెఱికురు ల్వేణి కందకమున్న, కనుబొమ ల్వక్రిమఁ గనకమున్న
జిగిగుబ్బలు మొగాన కెగయ సక్కకమున్న, నునుఁబల్కు నేర్పుగైకొనకమున్న
చూపులఁ జాఱుకుగాఁ జూడ నేరకమున్న, పీనుల మరుకథ ల్వినకమున్న
లలితయానము మదాలసతఁ బూనకమున్న, కటసీమ విస్తృతిఁ గనకమున్న
తే. చిత్తజుఁడు తమ్మిపూఁదూఁపు చెఱకువింటఁ
గూర్చి గుఱిచేసి తనునేయ గొల్లవనిత
సమతఁ గని చోరసురతసామ్రాజ్యమునకు
గిట్టతనమునఁ బట్టంబు గట్టుకొనియె. 102

అవ్విధంబున ఘోషకన్యారత్నంబు శైశవయౌవనసమయంబున మన్మథప్రేరితయై
విజృంభించి వర్తించునప్పుడు. 103

సీ. చిన్నిచన్నులుగోళ్ళఁ జీరఁ జెక్కులుగొట్టుఁ, గౌఁగిలించు మటంచుఁగడియఁ దివురు
గిలిగింత లొకకొన్ని కలయంగ నెనయించి, మోవి నొక్కమటంచు మొనసినిలుచు
నిచ్చకం బిగలొత్తఁ బచ్చికేరఁగఁ బల్కు, ముద్దిరా యని యొద్ది కరగు
బకదారి కవకీవ లొకదారిమైఁ జూపి, తమిఁ గూడరా యంచు దరికి సేగు

తే. సుపరతికి నెంచుఁ బరిహాసకోక్తులాడు
చేష్ట లెనయించుఁ బొలయల్కఁ జేతఁ గుందు
వెతల నేకారు మది నిట్లు విటులఁ జూచి
చిత్తజోన్మత్తయైగొల్ల చిన్నెలాడి. 104

చ. జిగినెరవన్నెకాఁ డెదుటఁ జేరినవేళల ముద్దుగుల్క మె
ల్లఁగ నడపం దొడంగు ఘనలౌల్యము చూపులఁ జూచి మోహపుం
బిగువునఁ బల్కరింపఁ జను బెళ్కుచుఁ బయ్యెదకొంగు దీటుఁ డె
క్కఁగఁ జిఱునవ్వు నవ్వు నొడఁ గూడిన సిగ్గున నేగు నవ్వలన్. 105

తే. ఇట్లు చరియించు నయ్యింతి యొమ్మె లెఱిఁగి
పొరుగుననె యుండెడునియోగిపుత్త్రుఁ డొకఁడు
జారశేఖరుఁ డనుబ్రహ్మచారి మీఱి
యొంటిపాటైనఁ దెరవులో నొడిసిపట్టి. 106

మ. అసమాలాప మచుంబితాధర మశయ్యాన్యోన్యవిక్రీడితం
బసమాలింగన మస్థిరోత్సవ మధైర్యస్తంబతాంబూలితం
బసుదంతాంకమ నిర్భయం బమణితం బస్రస్తనీవ్యాదికం
బసిధారావ్రత మైనచోరరతికార్యం బప్డు సంధించినన్. 107

సీ. చిఱుచెమ్మటలతోడఁ బెరసినఫాలంబు, కసవంటిపీడినకప్పుఁగొప్పు
కడురక్తిమము గల్గు గండస్థలంబులు వెనకకు దిగజాఱి వ్రేలుసరులు
పులకలు నిండారఁ బొడమినదేహంబు, ధూళిధూసరితమై దొరయుపీఁపు
మందస్మితంబగు మధుధరంబును, మందవీక్షణనమ్రమస్తకంబు
తే. తడఁబడ పడంకుచుండెడు తలిరుఁదొడలు
పదలిన బిగించి సవరించి పలుప దనరఁ
దిరిగి చూచుచుఁ దనయింటి తెరువుఁ బట్టి
గొల్లప్రాయంపుఁ జిల్కల కొల్కి చనియె. 108

క. అదిమొదలు జారశేఖరుఁ, డొదవవినయపుడెల్ల గొల్లయుగ్మలి సెంతో
మదనాహవమునఁ దేల్చుచు, మది మీఱఁగ మరుని లంకె మానిసిఁ జేసెన్. 109

క. చలి విడిచి జారశేఖరు, కలయిక చవి మరిగి తెరువు కాపెట్టుక ని
చ్చలులేని పనుల నెన్నె, నలవఱచుక యుండు విరహ మగ్గల మైనన్. 110

ఉ. కమ్మనిజున్ను మంచినెయి గట్టిది మీఁగడతోఁ బెరుంగుచో
కమ్మగు జున్నుపాలు చిలుకమ్మిసి దీసినవెన్నముద్దవె



చ్చమ్ముల కైదునాల్గు దినసాలకు మూడలముల్లె లిమ్మెయిం
గిమ్ములఁ దెచ్చియిచ్చు రతికిం బ్రతిమాలుచుఁ బిల్చు నిచ్చలున్. 111

తే. ఇటుల నజ్జారశేఖరుఁ డేలఁబట్టి
యింటిలో నున్నవస్తువు లెదురువెట్టి
పలుపులకుఁ జిక్కి కేరడములకుఁ జొక్కి
సంగమసుఖంబు కొన్నాళ్లు జరిపెఁ గన్నె. 112

ఉ. అంతటఁ బెండ్లిచేసెద మటంచును దత్సతి తల్లిదండ్రుల
త్యంతమహోత్సవంబునఁ గులావళితోఁ దగురూపరేఖలం
గంతునిఁ బోలునట్టి మృదుకాయము గల్గినవాని నొక్కశ్రీ
మంతుని జూచి తెచ్చియుఁగుమార్తెవివాహముఁ జేసి రెంతయున్. 113

తే. వేగఁ దలఁబ్రాలుగాఁ జేసి నాగవల్లి
యైనపిమ్మట నత్తింటి కనుపఁ దలఁచి
పయన మొనరించి నెమ్మదిఁ బ్రమద మలర
ననుఁగుఁగూఁతును నల్లుని ననిపిరపుడు. 114

ఉ. దువ్వెనతీరుగాఁ బసపుతో నలరించినబొట్టు నున్నఁగా
దువ్విన కొప్పువన్నెగల దుప్పట మొప్పు విడెంబు పుక్కిటన్
మవ్వపుఁ బోఁగునూల్ రవలమట్టెలు చేతులఁ బూలగాజులున్
నివ్వటిలంగ గోపహరిణీతరళేక్షణ పోవ ముందటన్. 115

సీ. సద్విజరాజసంశ్రయమహాస్పదలీల, శాఖలు కకుబంతచయముఁ బ్రాఁక
సాంద్రవర్ణక్రమస్థాయిత్వమున మించు, జట లనంతావాప్తి పటిమ మెఱయ
విష్ణుపదార్పితవిహితప్రవృత్తిఁ దనర్చు, నగ్రము లస్ప్రాశ్వ ననుకరింప
మహిలోకరాడ్భూషణాధారమై యొప్పు, మూలంబు కుండలిముఖ్యు దొరయఁ
తే. దనమహాగమవిఖ్యాతి ధరణిలోన, నఖిలజనులకు నద్భుతం బావహిల్లఁ
దేటపడఁగాను జూపెడు తెఱఁగు దోఁప, మలసి చూపట్టెఁ బథినొక్కమఱ్ఱిచెట్టు.

క. అపటభూజము చెంగటి, త్రోవను ముందట విభుండుఁ దొయ్యలి వెనుకం
బోవంగ జారశేఖరుఁ, డావెలఁదికి నెదురుపడియె నంతట వేడ్కన్. 117

చ. తమకముఁ బట్టఁ జాలక పథంబున ముందరఁ బోవుభర్తవి
క్రమము దలంపఁ బోక యధికంబగు మోహము నిల్పలేక వే
గమె యెదురించి వచ్చు నుపకాంతుని పల్లవకాంత తెప్పునం
గముకముఁ జేసి గుబ్బకవకౌఁగిట దార్చి సుఖించె వేడుకన్. 118

తే. బ్రామికలు దీర నన్యోన్యభాష లూరఁ గలయికలు జాఱఁ దాపాగ్నికణము, లాఱ
సౌఖ్యములు మీఱఁ జేష్టలుసరణి దేఱఁ, జెలఁగె నయ్యిద్దఱ దృఢాశ్లేషణములు

క. ఆయెడ నిజపతి సతి రాఁ, దాయె నరి తలంచి మఱి తనుఁ జూచినవో
నాయింతి పతికి హితముగ, నేయనువున బొంకవలయు నెఱుఁగింపఁగదే. 120

క. ఆమాడ్కి హంస యడిగిన హేమవతి యనియె నెవ్వరిడు నిక్షేపం
బేమతి వాకేకనవలె, నేమనుచుం దప్పఁ దాల్చె నెఱుఁగింపుమనన్. 121

ఉ. హంసహిమాంశుఁ డిట్లనియె నయ్యలివేణిని భర్త చూడ జా
రాంసమునందు వ్రేలు కులటాంగన దేహము కంపమొంద సా
యంసమయాదిఁ గోకిలవలె నారట మందుచు వీఁపుదట్టు మో
పుంసవరా యటంచు విటపుంగవు కర్ణము నాటఁ జెప్పినన్. 122

తే. జారశేఖరుఁ డాగొల్లసకియ నప్పుడు, వీఁపుదట్టుము వెఱవకు వేయటంచు
పలుకరించెనునంతలోఁ బఱువువాఱి, దాని ప్రియనాయకుఁడుభీతి డాయ వచ్చె.

క. వచ్చి యిది యేమిచెలి యని, విచ్చలవిడి వీఁపుజఱిచి వెఱవకు మని లోఁ
జొచ్చిన భయమున నవరిన, గచ్చుగ నిట్లనియె గోపకన్యక పతికిన్. 124

ఉ. ముందర నీవుపోవ భయమునన్ వెదచల్లెడు నీవలద్రుసం
క్రందనుఁ జూచిగుండెలు వకావకలై వెతఁ బొంది యీదయా
తుందిలుపొందునం బ్రతుకు త్రోవనుసచ్చితి లేకయున్న నా
కుందరిలేక యొంటి నిటఁ గుందుదుఁ గాదె యనుంగువల్లభా. 125

క. అనిచెప్పి నిజేశ్వరుచే, తనువనమోహంపు విటునిఁ దద్దయుఁ బొగడిం
చిన లినలోచన వేడుక, దనరారఁగఁ జనియెఁ బతియుఁ దానును సరణిన్. 126

క. అట్టియుపాయము నీకుం, దట్టిన నృపుపొందుమాట దలఁపుము లేదా
గట్టిగ నీమగఁ డెఱిగిన, యట్టయినను సిగ్గుపాటు లౌగదె చెలియా. 127

ఉ. నావిని హంసపల్కు పదనంబున హాసము దోఁపఁ బల్కె హే
మావతి యద్దిరా మగలమార్చు నెలంతదిగాక యింకక
ద్దావిపరించి చూడ వసుధాస్థలిలోనను నంతలో పలక
వేవినఁ గేళికాగృహము వేగ చనెన్ నృపమోహమగ్నయై. 128

వ. మఱియు నయ్యహర్ముఖంబు ప్రకాశమానకావ్యలక్షణంబయ్యును బ్రకాశమానకావ్యలక్షణంబై యనిద్రాళువనాంతరాళపుండరీకసముదయంబయ్యును నిద్రావనాంతరాళపుండరీకసముదయంబై యప్రస్ఫుటీకృతకువలయంబయ్యును బ్రస్ఫుటీకృతకువలయంబై యవిభాసమానద్విజరాజం బయ్యును భాసమానద్విజరాజంబై యవిభాసితతారాళిగణంబయ్యును విభాసితతారాళిగణంబై యొప్పెనప్పుడు.



క. ఒకనిమిషం బొకమాసం, బొకఘటికయ యొక్కయయన మొకజా మొకయే
డొకదిన మొకకల్పముగా, సకి గడపెం బవలు విరహసంతాపమునన్. 130

క. రవి యనెడు కాలచక్రము, దివసాంతప్రళయవేళ దీపాగ్నులచే
దివిఁ గాల్చియడఁగ నమ్మషి, నిసహంబన ఘోరతమము నిండెం జెలువన్. 131

వ. అప్పుడు. 132

చ. చందురుకావిపావడపస ల్వోలిఁ జిమ్మగఁ జల్వఁగట్టి కా
లందెలు సందిదండలును హారములు న్మణికుండలమ్ములుం
బొందుగఁ దాల్చి వాసిలెడు పూలసరు ల్కచసీమఁ జుట్టి పా
ల్పొందఁ గళాస గందవొడిఁ బూసి మృగేక్షణ వచ్చి నిల్చినన్. 133

క. చూచి కలహంస మిట్లను, వాచావైచిత్రి మెఱయ వనితా చోద్యం
బై చెలువొందిన యొకకథ, యాచించి నృపాలుకేళి కరుగు మటన్నన్. 134

క. ఆమధురతరసుధారస, సీమాసామోక్తిధార చెవులకు నెంతో
యామోదము చేసిన విని, హేమావతి యనుగ హంస మిట్లని పలికెన్. 135

---

ఆఱవరాత్రికథ.

శా. జంబూద్వీపధరారవిందముఖి కంచద్భూషణప్రాయమై
సాంబప్రస్థ మనంగ నొక్కటిమహాస్థానీయ మొప్పారు ర
మ్యంబై యప్పురిలోన సుండు హరిశర్మాఖ్యుండు విప్రాన్వవా
యంబున్ శోభిలఁ జేయుకర్మఠుఁడు కళ్యాణాంగి యాలింపుమా. 136

సీ. బలుకంచు గుబ్బబోత్తులు పులుతీనెల, వాకిలి నడవ చావడియు మగులు
నఖిలవస్తువుల ధాన్యముల కణంజలు, దేవతార్చనమిద్దె తావిపడక
యిలువంటకొట్టంబు పలుగాఁడి పసిదొడ్డి, పసపాకుపందిరి బావి తోఁట
మడిసంచిదోవతి మడతప్రేల్దండెంబు, ధమనికుండంబు బృందావనంబు

తే. నక్షతలచిప్ప సాన చిత్రాసనమును
గిండి చిటిచాప పళ్లెంబు గిన్నెపెట్టె
కుశసమిత్పత్రములు పెట్టు గొప్పయటుక
యమరఁగా పుర ముండు నయ్యగ్రజుండు. 137

చ. అతనికి హేమచిత్ర యను నంగన శృంగినవెన్కఁ జారుభా
స్వతి యను ముద్దుగుమ్మను వివాహ మొనర్చిన నింతి యట్టె య
య్యతనునిచేతికత్తిచివు కంతయుఁ బోయినఁ బేదఁ జిక్కు స
మ్మతి నెలజవ్వనంబు పొడమన్ జిగిదేఱెడు దేహసంపదన్. 138

క. ఆపటుకుచములచందం, బౌపెద్దపిఱుందుమంద మామో మందం
బాపాంకం బౌబింకం, బాపంకజముఖికె కాక యన్యకుఁ గలదే. 139

ఉ. ఆమధురోష్ఠి గుబ్బకవ నబ్బినసిబ్బెపుఁదక్కు లంద మా
యామృదులోరుకన్నుఁగవ నన్నువ వెన్నెలలోల్కు చందమా
యామితమధ్యసోముకళ లానినమోము మెఱుంగులందమా
యేమని చెప్పవచ్చు నలినేక్షణ యాచెలిరూపసంపదల్. 140

తే. వక్రయానంబుతో నాగచక్రకుచలు
నిలువుఁ గన్నులతో దేవనీలకచలు
నాతిమృదుగతిచపలేక్షణములకలికి
క్రిందుమీఁదయ్యెఁ గాదె పూర్ణేందువదన. 141

సీ. నెఱిగొప్పు మేఘసందేశంబు కనుదోయి, యందమౌ కువలయానంద మరయఁ
బొంకపుమోము ప్రబోధచంద్రోదయం, బధరంబు మణిసారహార చూడఁ
జెలువంపుఁ జిఱునవ్వు సిద్ధాంతకౌముది, స్తనయుగంబు రసమంజరి నుతింపఁ
గరరుహంబులకాంతి కావ్యప్రకాశిక, ఘననితంబము రసాయనము తలఁపఁ

తే. దను వలంకార మతనుశాస్త్రములు చూపు
లహహ మధ్యంబు నాటకం బవనిలోన
విద్యలకునెల్ల మూల మీవెలఁదిఁ గనిన
విద్యలు పఠింపఁగా నేల వేఱె బుధులు. 142

వ. అది మఱియును. 143

చ. బుగడలు నానుతీఁగె మెఱుపు ల్గనుకమ్మలు గుండ్లపేరు బ
ల్పగడపుఁ జేకటుల్ రవలపల్లెరుపువ్వులు కుప్పె సౌరుమీఱ
జిగికడియంబులాణిమణిచెక్కినముక్కర గిల్కుమెట్టెలుఱ
సొగసు దలిర్ప నచ్చెలియసొమ్ముల నెమ్మెల నొప్పు నెంతయున్. 144

సీ. కప్పుఁగొప్పుఁ బడాబగలఁ జూడనిఘనుండు, పఠనంబునకు వింతపడనిజనుఁడుఁ
గన్నుల కాశ్చర్యగరిమఁ జెందనివాఁడు, సరసభాషలకు మెచ్చనినరుండు
గబ్బిగుబ్బలతీరు గాంక్షింపనివిటుండుఁ, గౌను నుతింపనికాముకుండుఁ
గటికి శిరఃకంపపటిమఁ బూననిమర్త్యుఁ, డంఘ్రులు బాపురే యననివిటుఁడు

తే. నాస్తి యన్నృతంబు దబ్బర నహి హుళిక్కి
కల్ల మఱియిల్ల లేదు భూగతులలోనఁ
గ్రమ్మి జిగిఁ జిమ్ము నమ్ముద్దుగుమ్మ హొయఁ
జెలువ మెటువంటిదో కాని చిగురుబోఁడి. 145



సీ. పాపట యిడి నూనెపంకెనతోనున్నఁ, గాదువ్వి నెఱులు కీల్గంటు వైచు
నెఱ యొయ్యారముతోడ నీటికాఁగులనీడఁ, జూచి కుంకుమబొట్టు సొంపుదీర్చు
గంధంబుపూసినగతి గబ్బిజిగిగుబ్బ, కవమీఁద గుత్తంపురవికె దొడుఁగు
నుమ్మెత్తపూరీతిఁ గ్రమ్ముకుచ్చెల నేలఁ, జీరాడఁగాఁ జల్వ చీరగట్టు

తే. నీటు బెళుకున దిగజార పైఁటచెఱఁగు
జగ్గుతో దోపుఁగాటుక నిగ్గుకనుల
మిక్కుటపుఁ జూపు మెఱుఁగు తళుక్కు మనఁగ
వెడలు నొకవేశగృహము నవ్విప్రవనిత. 146

క. పతిరతిని దృప్తిఁ బొందక. మతిఁ జపలత పుట్టి యన్యమానవురతికిఁ
హితముపడి మోహదశలఁ, బతిమాలి కృశించుఁ జారుభాస్వతి యెపుడున్. 147

తే. పురములోఁ గల్గు మోహంపుఁ బొగరు చిగురు
కోడె నెఱజాణవిటులకుఁ గొంతకొంత
వింతరతితంత్రములు నేర్పి విడిఁబడున్న
కంతుమదదంతి పంతంబు గదియఁ దిరుగు. 148

క. ఈలీలఁ గొంతకాలము, బాలామణి సంచరించు ప్రాయము నాఁడే
కాలూఁదియున్న యిందిర, తాలిమి చెడి నిలువ కచటు తలఁగినయంతన్. 149

సీ. కులమహీరుహమహాకుఠారంబు, శోపాగ్నివృద్ధికృద్ఘోరనాడి
సంసారసుఖశైలశరకోటిపతనంబు, దేహవ్యథాలతాదోహదంబు
శశిముఖీదృక్పాతసంరోధిజంబీర, ఫలరసం బతిధైర్యభర్మకషము
ప్రతిభాంబుహృద్గ్రీష్మపవనంబు నిజవధూ రచితనిందాసారనిచయఘనము

తే. సంతతాహారి సంపాదిసంభ్రమప్ర, యత్నవిఘ్నదమతనుక్షుధార్తిదాయి
యమితలఘుతాశ్రయస్థానమై కడంగు, భూరిదారిద్ర్యదోషంబు పొదలె నప్పుడు.

క. అట్టిమహాదారిద్ర్యము, దొట్టిన హాదిశర్మ ధృతియుఁ దూలక తృష్ణం
గొట్టుపడకుండఁగాఁ దన, పట్టపుటిల్లాలిఁ గష్టపడి పోషించెన్. 151

సీ. పంచాంగములు సెప్పి బాజారులోపల, రంజిల్ల యాయవారంబు లెత్తి
తలమీఁద మంత్రాక్షతము లుంచికలకాఁపు, టిండ్ల సుపాదాన మెత్తి తెచ్చి
గ్రహణసంక్రమణాదికాలంబులను రాచ, నగరాశ్రయించి దానములుపట్టి
తిలలు దర్భలు పూని తీర్థసన్నిధిమంత్ర, ములు సెప్పి నిరుకానులు గడించి

తే. జన్నిదములమ్మి గ్రహశాంతి జపముఁజేసి
శవములను మోఁచి దుర్దానసమితి కొగ్గి

వచ్చునాదాయములు గ్రాసవాసములకుఁ
గాఁగ దినములు గడపె నక్కాలమునను.

శా. అంభోజప్రియతిగ్మదీధితిచయవ్యాఘాతనిర్భగ్నభూ
గంభీరోరుజలోద్గతాధరజగత్క్రూరాజరాడ్భోగస
చ్ఛుంభద్రత్నఘృణిభ్రమప్రదకనత్సూర్యోపలజ్వాలికా
జృంభత్పావక మొక్క వేసవి జనించెం గాలకూటాభమై. 153

చ. శరచరసాధ్వసప్రదము సర్వబకౌఘమదప్రదాయకం
బురుజలహైన్యకారము సముజ్జ్వలసాంద్రమరీచికాసము
త్కరవనరూపకారకము గాఢపయోధివియోగ కార్శ్యభీ
కరతటినీతనుప్రదము కాసరభీష్మము గ్రీష్మ మెచ్చినన్. 154

చ. పవలను వర్తకాగ్రణి నభశ్చల సాగరమధ్యమంబులో
రవి యనునోడమీఁద నపరక్షితిభృత్పురిఁ జేర రా మరు
జ్జవగతి సుళ్లఁ బెట్ట నదిసాగక చిక్కినమాడ్కి సూర్యుఁ డ
య్యవసరమందు మందగతు లానిన దీర్ఘము లయ్యె ఘస్రముల్. 155

తే. మల్లికాకుంజపుంజాబ్ధిమధ్యమున మ
రీచికాస్వాతివృష్టి గురియ జనించి
పత్రపుటశుక్తు లెండలఁ బగుల బయలు
పడినముత్తెము లన మొగ్గ లడరఁ దొడఁగె. 156

సీ. దేహంబు బలువెట్టదీసి సిస్తుగ నుండుఁ, జలువగాఁ బన్నీట జలకమాడి
ఘనసారయుక్తమై తనరారు పాటీర, పంకంబు తనువున నింకఁ బూసి
విమలనాగరచూర్ణవిహితమౌ మాహిష, దధ్యోదనము ప్రొద్దుతతి భుజించి
బహుళలామజ్జకప్రసవసౌరభమిశ్ర, శీతలజలముల సేవఁగలిగి

తే. కప్పురపుఁదిన్నె లమర బూఁజప్పరములఁ, జిగురుఁ బాన్పున వసియించి శీతవాత
జాతకరతాళవృంతము ల్సతులు వీవఁ, బ్రొద్దు వుచ్చిరి కొందఱు భోగు లపుడు.

తే. అట్టివేసవివేళ ధనాఢ్యుఁడైన, యచ్చటినియోగి చలివెంద్ర లాదియందుఁ
బెట్టఁ గట్టడిఁ జేసినఁ బేద లగుటఁ, జారుభాస్వతి హరిశర్మ చేరి రపుడు. 158

సీ. లవణశుంఠీజంభలరసానుయుక్తిమా, నీరుమజ్జిగకుండ బారు లలర
లఘువృతైలానూనలలితసౌరభమిశ్ర, శీతలజలకుంభజాత మమర
జీరకకైడర్య్యచారుగంధములొలుకు, పలుచనియంబళ్లి పంట్లు దనర
రసయుప్పు నీరుల్లి రసము నించినకోళ్లు, గంజకాఁగులఁగంపు కడుఁ రహింప



తే. గంధబర్హిష్ఠలామజ్జకప్రశస్త, కాయమానముహుర్ముహురాయమాన
మందపవమానఘనసార బృందవేది, కాలయవితానపానీయశాల యొప్పె. 159

వ. మఱియును నచ్చలిపందిరి గవాక్షాదిప్రవాకలితవాయుజాతసంచారంబు గావున రఘురామమనోరంజకంబును బాంథజనసంతాపహరణంబు గావున సత్కృతసంగమంబును గబంధప్రచురంబు గావున దండకావనంబును సితాభ్రసంచయకలితంబు గావున శరత్కాలంబును నమృతసంపూర్ణకుంభంబు గావున సురేంద్రనివాసంబును ఛాయాసమేతంబు గావునఁ దపననిలయంబును వివిధకుసుమసుగంధబంధురంబు గావున నారామంబును బురుడించు నప్పుడు. 160

క. అచ్చలిపందిరిలోపల, నిచ్చుచుఁ బోయ్యేటిపరసవారికి జల మం
దిచ్చుచును జారుభాస్వతి, యచ్చట హరిశర్మ యుండు నాసమయమునన్. 161

చ. ఉపమరి బుద్ధిశాలి వినయోత్తముఁ డప్రతిమప్రభావళీ
తపనుఁ డవార్యధైర్యుఁడు నుదారచరిత్రుఁడు సర్వసత్కళా
నిపుణుఁడు రూపనిర్జితవనేరుహసాయకుఁ డొక్కవిప్రుఁ డా
తపపరితప్తుఁడై జలముఁ ద్రావఁ బ్రపాస్థలిఁ జేరి వేఁడినన్. 162

తే. చారుభాస్వతి శీతలజలము లపుడు
గిండితోఁ దెచ్చి యిచ్చి వీక్షించి వాని
చక్కఁదనమున కలరారి సరస కేగి
యలఘుసాహసమునఁ దమి నిలుపలేక. 163

క. ప్రక్క లెగఁబొడువ మన్మథుఁ, డక్కోమలి పతికి వెఱవ కానందముతో
నక్కునఁ జేర్చుకపాంథునిఁ, జొక్కుచు నుండంగ మగఁడు చూచె లతాంగి. 164

తే. ఎట్లు బొంకంగవలె నప్పు డిందువదన, నేర్పు గలిగినదానవు నృపతిమౌళి
కేళికైతేను నీ కిది కేవలంబు, దొడ్డగాదు విచారించి తోఁచె చెపుమ. 165

క. అనిన కలహంసపలుకులు, విని హేమావతివిచారవిపులాబ్ధిమునిం
గినమది నా కిది తెలియదు, వినుపింపుము నీవె యనిన విధి హరి యనియెన్. 166

చ. అటువలె జారుభాస్వతి ధరామరుఁ గౌఁగిటఁ జేర్పఁ జూచి తాఁ
జటులతరోగ్రభాషహరిశర్మ యదల్చినఁ దొట్రుపాటునం
బెటిలక యీతనిన్ వినుము పిన్నతనంబున దేశచారియై
పటుగతిఁ బోయె మాతులునిపట్టి సుమీ యని లేనిదీనతన్. 167

తే. కాంతునకుఁ దెల్పి మఱిమఱి కౌఁగిలించి
చెమటకణములఁ దనపైఁట చెఱఁగుచేతఁ

దుడిచి యాతనికే ల్పట్టి తోడితెచ్చి
మేల మాడుచుఁ బానీయశాల కపుడు. 168

సీ. గొనబుతో నెన్నాళ్లకో నెల్వగా నేటి, కైన నిన్నే నయ నా కబ్బెననుచు
నీవు నామీఁద నిజముగాఁ జెప్పుమా, నాయందుఁ బ్రేమ కద్దా యటంచుఁ
బదిదినా లుండక పారిపోయెద నన్నఁ, బోనిచ్చునా వెఱ్ఱిదైన ననుచు
నీప్రొద్దు నుదివసం బేనోము ఫలమొ నా, మనసులో నెంజిలి మానె ననుచుఁ
తే. జేరిక లొనర్చి తేనియ ల్చిలుకఁ బలికి
మోహ మూరించి తరితీపు మోపుకొల్పి
యతనిమీఁదను బతికిని హితము వొడమ
మున్నె యొనరించి వానితో మురియఁ దొడఁగె. 169

క. ఈకరణిఁ జారుభాస్వతి, యాకాంతుఁడు దీఱ నాఁ డహర్నిశ మతనిన్
డీకొల్పి రతులఁ జివురుం, జేకత్తి వజీరు సడ్డసేయక యుండెన్. 170

క. అటుపలెఁ గాలోచితసం, ఘటితోక్తిస్ఫూర్తి నీకుఁ గలిగిన భూభృ
న్నిటలాక్షుఁ గదియఁ జిటిపొటి, నటనలఁ బోవమ్ము కుందనపుజిగిబొమ్మా. 171

చ. అన విని మందహాసము ముఖాబ్జమునం జిగురొత్తఁ గర్ణ వే
ష్టనమణికాంతి చెక్కులహుటాహుటినాట్యము సల్ప నారయం
చును దలయూఁచి వేఁకువగుచోఁ జెలికేళిగృహాంతరంబునం
చెనసి నృపార్పితేచ్ఛఁ బనలెల్లను ద్రోయుచు నుండె నంతటన్. 172

చ. సమయమహేంద్రజాలకుఁడు సారసమిత్త్రుఁ డనేటిపద్మరా
గము వెస మాయఁ జేసి కుతుకంబున హా యని నీలపంక్తులన్
భ్రమపడఁ జూచి ఝా యనుచుఁ బల్కి నుపాణులఁ జేసి చూపెఁ జి
త్ర మనఁగఁ బ్రొద్దుగుంకెఁ దిమిరం బెసఁగెన్ దివి నొప్పెఁ దారకల్. 173

క. ఆవేళను గృహకృత్యము, తా వేగమె తీర్చి పేర్చుతమకంబున రా
డ్దేవేంద్రునిఁ జేరఁగ హే, మావతి నెమ్మదిఁ దలంచి మహితోత్సుకతన్. 174

ఉ. దిద్దిననాభినామము కదించినమేల్మడిచీఱ చీర్ణమై
నిద్దపుఁబూఁత పుష్పములు నించి ముడించినకొప్పు రత్నము
లద్దయుఁ గల్గుసొమ్ములు గళమ్మునఁ జొక్కపుఁజుక్క యొప్పఁగా
ముద్దియ వచ్చి హంసమణిముందర నిల్చె నృపాభిలాషయై. 175

క. నిలిచిన యాహేమావతి, పొలిచిన కరుణామృతంపుభూరితరోక్తుల్
పొలయఁగ దృష్టిఁ గనుంగొని, దలఁచినపని కపుడు హంస ధరణిపుఁ డనియెన్.



ఏడవరాత్రి కథ.

క. మున్నొక్కపట్టణంబున, సౌన్నారి మిటారి నేర్పు శూరత్వము గై
కొన్నదియై నడచినకథ, చెన్నుగ విని పొమ్ము కడువిచిత్రము కొమ్మా. 177

తే. అనినఁ జెలువవ్వ నవ్వి యయ్యంబుజాక్షి, యేమి చిత్రంబు గల్పించి తింతలోన
శీఘ్రముగఁ జెప్పిదయచేసి సెల వొసంగు, మరిగెదను రాజుపొందునకనిన నపుడు.

క. కాదంబవంశవల్లభుఁ, డాదృతిని బరాకు లేక యక్కానో వినవే
మోదముతో నని చెప్పెను, మేదురమాధుర్యసాధుమేధాభణితిన్. 179

క. విను మనఁగా ననఁగా నిల, ఘనమణివర మనెడుపురము గలదొకటి వినూ
తనకేతన పటజాతప, వన హతసురసురతఘర్మసనవారంబై. 180

చ. కమటము కట్ల సంచి యొరగల్లును గత్తెర సుత్తె చీర్ణముల్
ధమనియు శ్రావణంబు మొలత్రాసును బట్టెడ నీరుకావు శా
ణము పటకారు మూస బలునాణె పరీక్షలమచ్చు లాదిగా
నమరఁగ భద్రకారకసమాహ్వయుఁ డొండొకఁ డుండు నప్పురిన్. 181

చ. కరఁగను బోతఁ బోయఁగను గ్రాఁచి కదించను గమ్మిదీయఁగా
నొరయఁగ వన్నియల్మిగుల నుండఁగఁ జూపఁగఁ బాదగట్టరే
కరయఁగఁ దీరఁ జెక్కఁబడి యచ్చునవేర్పఁగ సుద్దగించఁగా
సొరిది విచిత్రచిత్రముగ సొమ్ములు సేయ నతండు నేరిచెన్. 182

క. కంతునసంతజయంతుల, సంతసమున గెలువఁజాలు సౌందర్యమునన్
సంతతసంపద్గరిమఁ గృ, తాంతజిదాప్తుని జయించు నతఁడు శుభాంగీ. 183

వ. మఱియు నాభద్రకారకుడు కాణంబు నాడీప్రచురంబు గావున శరీరంబును శుక్రాంగారప్రశస్తంబు గావున నక్షత్రమండలంబును గుంభతులాదిసహితంబు గావున రాశికూటంబును గాంగేయశిక్షగలిగినది గావున శిఖండిఖండనంబును మధూచ్ఛిష్టసంయోగంబు గావున యవననివాసంబును వప్రోన్నతంబు గావున మహాపురంబును మూషికావృతంబు గావున శూన్యాలయంబును దీక్షసాధనయుక్తంబు గావున యుద్ధరంగంబును శ్రావణయోగంబు గావున వర్షాకాలంబు ననుకరించు- 184

తే. అతనిసఘూటి శుకఘోటి నలరుమేటి, యొడయఁ డేతేటి సీమాటి యొఱపుగోటి
కొనసెగయమీటి యిదియేటి కులుకనేటి, పోటి కెదిరేటిశుభవాటి నీటు మెఱయు.

తే. దానికచకుచగళలక్ష్మిఁ బూనఁ దలఁచి, నీలశైలాబ్జములు మ్రోల నిలిచినపుడె
కసవుకట్టెలు నీళ్లనుఁ గడఁగి మోయఁ, జేసె నేమనవచ్చు నచ్చెలువ చెలువు. 186

క. కుందనపురవలు గుప్పెడు, తుందిలపుం జన్నుఁగవయుఁ దొలతేనెలకున్
విందు లొనరించుపలుకులుఁ, జందురునింబోలు మోము సకియకె యమరున్. 187

క. కువలయ మాకనుఁగవ జిగి, కువలయ మావలుదపిఱుఁదు కుచకాఠిన్యం
బవలయ మామోహనతా, రవలయ మానఖము లనఁగ రమణి రంహిచున్. 188

మ. కచశోభాగరిమంబు నెన్నడుము సైకంబుల్ మధుప్రాయమౌ
వచనవ్యూహము లోచనాబ్జములధావళ్యంబు శృంగారవ
త్కుచకుంభమ్ములపొంకముల్ ముఖకళాంకూరప్రభావంబు న
య్యచలశ్రోణికిఁగాక నేసకియలందైనం బ్రవర్తిల్లునే. 189

సీ. కుప్పెరాగడిబిళ్ల కుంకుమరేఖపా, పటబొట్టు కమ్మలు బావిలీలు
లలిసూర్యచంద్రవంకలు ముసకము కెంపు,రవలపల్లెరుఁ బూవు రావిరేక
బుగడలు నానుఁగోవులు తీఁగ మెడనూలు, కుతికంటుసరపణగుండ్లపేరు
సరిగె ముక్కెర బన్న సరము నుత్తండాలు, కంకణంబులు తట్లు కడియములును

తే. సందిదండలు నొడ్డాణ మంద మైన
ముద్రికలు హంసకంబులు మ్రోయుగజ్జె
లలరు బొబ్బిలికాయలు గిలుకు మట్టె
లాది యగుసొమ్ము దాల్చె నయ్యబల మెఱయు. 190

క. దాని నెగాదిగఁ జూడని, మానవునిం దానిపొందు మదిలో నెపుడుం
బూని తలంపని పురుషుని, గానము త్రిభువనములందుఁ గలవారలలోన్. 191

క. ఆశుభవాటి మనోహర, పేశలతర మృదులవాక్యపృథుమాధురిచే
నాశపడి మారభూతా, వేశమునఁ జరించు వీట విటయూథంబుల్. 192

శా. నీవీబంధము చక్కదిద్దునెతివేణిన్ లెస్సఁ గైసేయుఁ గె
మ్మోవిం జిల్కుదరస్మితంబు జిగిచూపు ల్వాఱఁగాఁ జూచుచుం
గ్రేవల న్నవ్వడఁ జేయు నెచ్చెలియతోఁ గేల్కేల దట్టించి వా
చావైచిత్రిని ముచ్చటాడుసకి తన్ జార ల్విలోకింపఁగన్. 193

తే. ఇటుల మదమెత్తి తమిచేత నేపురేఁగి, తిరుగు నవ్వీటఁ గల్గినధీరవిటుల
పొందునకు నాసపడి పోవసందులేక, కుందుచుండును విరహార్తిఁ జెంది యెపుడు.

వ. అంత. 195

మ. చిగురుం గత్తివజీరుమాఱుపఱుపం జెన్నొందు నొయ్యారపుల్
సొగసుం బ్రాయము గల్గువాఁ డొకఁడు మేల్పొన్నారి ధూర్తాఖ్యచేఁ
దగఁ బెంపొందినవాఁడు శిల్పఘనశాస్త్రప్రక్రియ న్నేర్వఁగాఁ
దెగువ న్నిల్చెను భద్రకారునకు నంతేవాసియై వేడుకన్. 196

క. వానికుశలత్వసంపద, వానిమనోహారిరూపపరవైభవమున్
వానిఘనబుద్ధిఁ జూచి య, హీనకరుణ నింట నిల్పి హితముల రారన్. 197



తే. కీర్తికెక్కె భద్రకారుఁ డాధూర్తునకుఁ ద, నింటనే యన్నవస్త్రాదు లిడుచుఁ గల్గు
పనులు నేర్పుచు నుండంగ భక్తిమీఱ, నలఘుశుశ్రూష సేయుచు నాతఁ డుండె.

క. కందువమాటల బెళుకుల, మందస్మితరుచిరవచనమాధురిచేతన్
దుందుడుకుఁ జెంద ధూర్తుని, డెందము గరఁగించి చెలి ఘటించెన్ రతికిన్. 199

తే. ఎడతెగని మోహ మూరించి యేపురేఁగి
వేశ్మమున నొంటిపాటైన వేళలందు
మదనకదనంబునకుఁ జాల మరులుకొనఁగఁ
జేసె శుభవాటి ధూర్తుని చిత్త మలర. 200

చ. అలయక భద్రకారుఁడు గృహంబున నుండినయప్పు డెల్ల వే
డ్కలఁ బను లభ్యసించుచుఁ దడంబడ కాతఁడు లేనివేళలం
జెలఁగుచు వానిభార్యకడఁ జేరి మనోభవకేళికాక్రియల్
తొలఁగక యభ్యసించు శశితుల్యుఁడు ధూర్తసమాఖ్యుఁ డున్నతిన్. 201

తే. స్నానపానాన్నవస్త్రాదిసంగ్రహంబు, భద్రకారుఁడు సెల విచ్చెఁ బనికి మెచ్చి
వానిచెలువంబునకు మెచ్చి వలచినపుడు, చాల శుభవాటి సెలవిచ్చె సంగమంబు.

క. ఈతీరు సకలభోగము, లాతతగతి నడచుచుండ నాధూర్తాఖ్యుం
డాతలిరుఁ గత్తిగలవొర, చేతికటారికిని సడ్డ సేయక యుండెన్. 203

వ. అయ్యవసరంబున. 204

ఉ. ఆదర మొప్ప నొక్కదివసాంతమునందు దుకాణముం బహి
ర్వేదిని భద్రకారుఁ డమరించుక ధూర్తునిఁ జూచి మిద్దెలో
బోదియమీఁదనున్న తుల పొందుగ వే కొనిరమ్మటంచు సం
మోదముతోడ నంపఁగ సముద్రగభీరుఁడు పోయి మాడఁగన్. 205

తే. వానియొయ్యార మొకవింత యైనపుడు
చూచి వలరాజు రాజ్యంబుఁ జూరఁగొలుపఁ
దలఁచి శుభవాటిధూర్తుతోఁ దారసిల్లి
తలుపు గదియించి రతికేళి సలుపుచుండె. 206

క. చెన్నారి చుంబనంబులుఁ, జిన్నారివగ ల్వినోదచేష్టలుఁ జెన్నల్
గన్నారఁ జూపి యపుడా, సొన్నారి మిటారి ధూర్తు సురతుల గడఁచెన్. 207

క. ఈలీల మదనకదనా, లోలత్వముఁ బూని యింటిలోపల ధూర్తుం
డాలస్యం బొనరించినఁ, దాలిమి చెడి భద్రకారధన్యుఁడు చింతన్. 208

చ. తడసె నిదేమొ ధూర్తుఁ డల దర్పకు బోలినవాఁడు భార్యయుం
గడు రతిఁబోలు రూపుసిరి గల్గిన జవ్వని యేమిద్రోహముం

గడిమి నొనర్చిరో యనుచుఁ గా లటునిల్వక వచ్చి గట్టిగాఁ
గడెనిడుతల్పుఁ జూచి ఘనగర్జితభాషలఁ బిల్చె శిష్యునిన్. 209

తే. అప్పు డాజాయ తమచాయ నధిపుమదికి
హితముగా భోంకవల యను నో యింత యనుచు
హంస మడిగిన దరహాస మలర మోము
వంచి హేమావతీసాధ్వి యంచ కనియె. 210

క. ఒకరొకరి బుద్ధి యెట్లో, యకటా తెలియంగ బ్రహ్మకైనను వశమా
కిపరించక యిది నీవే, యకుటిలగతి నుడువు మనిన హంసం బనియెన్. 211

మ. విను హేమావతి భద్రకారుఁ డటకు న్వేగంబుగా వచ్చి శి
ష్యునిఁ బిల్వన్ భయ మంది వాఁడు జనితాస్తోకవ్యథం గుంద నా
తని భీతిల్లకు మంచుఁ జెప్పి తులసూత్రంబు ల్వడిం ద్రెంచి వై
చి నిరాఘాటత నేగి వాకిలి సడల్చెన్ నాయకున్ దూఱుచున్. 212

వ. అట్లు వాకిలి దీసి భర్తతో మఱియు నిట్లనియె. 213

చ. తులఁగొనితేను మంచిగుణఘుష్యునిఁ బంపితి రౌను మీరలుం
బిలిచినఁ జూడవత్తుఁ గద భీతిని దారము లన్ని దెంచి యీ
తలుపు గదించి సూత్రములు త్రాసునఁ గూర్చుచునున్నవాఁ డిసీ
పలువ మఱింత నేర్పరని భర్తకుఁ జూపి దురుక్తు లాడినన్ 214

తే. ఎంతలే దింతెకద దీని కిట్టు లనకు
తానె పోయెను గాంత చేఁ దప్పిపోవ
నేమి సేయుదు మని ధూర్తు నితర మనక
డెందమున సందియ మొకింత చెందకపుడు. 215

క. ఎప్పటివలె నుండె విభుం, డప్పగిదిన సూక్ష్మబుద్ధి నారయవలె నో
యొప్పులకుప్పా నీ కని, చెప్పఁగ హాసంబు మొగముఁ జెలువము దోఁపన్. 216

క. ఆవేళ శిరఃకంపము, గావించి యయారె యని చొకాటం బగుకే
లీవాసముఁ జేరెను హే, మావతి నృప మోహ మగ్నమానస యగుచున్ 217

మ. కనదృక్షాలయ కామహాబిలమునం గన్పట్టు భాస్వచ్ఛమా
తనవానర్ఘ్యమణిం దటిన్యధిపసత్రాజిత్తునిం జేర్చె నో
ముసు దాఁ గైకొని కాలకృష్ణుఁ డన నంభోజాస్త్రుఁ డప్పశ్చిమాం
బునిధిం జేరె దదబ్జనాభఘుమ్రీనాఁ బొల్పొందెఁ గ్రౌంచీకటుల్. 218

వ. అయ్యవసరంబున. 219



సీ. విటమనోధృతిశిలావిచ్ఛేదతాటంక, తాటంకమణికాంతితతులు వెలుఁగఁ
బల్లవమానసపటుధైర్యహారక, హారకళాస్తోమ మాఘుళింప
గమనహృద్దార్ఢ్యాబ్జగణశీతకంకణ, కంకణాంగదములు ఘల్లురనఁగ
జారాత్మదృఢతాసమీరాహిసంతాన, సంతానకుసుమవాసనలు వొలయ

తే. యువజనస్వాంతకాఠిన్యదవసమీర, బంధుఘనసారఘనసారగంధసార
సారభోదారకుంకుమస్థానకంబు, దనర రాయంచకడకు నత్తరుణివచ్చె. 220

ఉ. వచ్చినఁ గాంచి హంసకులవల్లభుఁ డాతలిరాకుబోఁడిపై
లచ్చికినిచ్చగించి యనులాపకలాపకశారసజ్ఞతన్
మెచ్చి నృపాలుపాలికిని మేకొనిపోయెద వేమొ పొమ్ము నా
ముచ్చట లాలకించి కడుముద్దులుగుల్కెడు ముద్దియా యనన్. 221

క. అనిపల్కు నంచవాచా, తనుమాధుర్యమున సొక్కితత్కథయేమీ
వినియెద నన హేమవతి, కనురాగం బొప్ప రాజహంసం బనియెన్. 222

## ఎనిమిదవరాత్రికథ.

మ. కలదుద్యద్ధ్వజశాటికాపటలజాగ్రద్వాతసంచారసం
చలదభ్రస్థలినిల్వనక్కితదవస్థం బాపఁదద్భ్యామిరా
ట్కులమాలిన్ శరణంబు వేఁడుటకుఁ దోడ్తో వచ్చెనో యంబుదం
బులనన్ మత్తకరుల్సెలంగ నొకప్రోల్పున్నాగపుంజం బనన్. 223

సీ. గోళ్లరక్కలజోళ్లు వ్రేళ్లుమావిచిగుళ్లుఁ, జెల్లుఁ బుక్కిళ్లుల్లశిల్లు నుళ్లు
దూరడ్లు బాహలు గిండ్లుచెండ్లుబోల్పాలిండ్లు, కండ్లు మీల్సింగాణివిండ్లు బొమలు
జూపు మారునితూపుఁజూపు మోములయేపు, బాపురే శశిరూపు మాపనోపుఁ
గప్పు పెన్నాటికొప్పులొప్పు చీకటిచొప్పుఁ, గప్పు నవ్వులు విప్పుకప్పురములు

తే. బొంగు బంగారురంగు లనం గడంగు, నంగలతల నెసంగు మెఱుంగు గురవు
లనుచు నిజరూపవైభవంబఖిలజనము, లభినుతింపంగ వెలయుదుర చెలిసతులు. 224

వ. వెండియు నప్పురంబు సర్వమంగళాభ్యుదయనివాసంబై హిమవద్భూధరంబుపోలికిని సుధర్మాస్పదరూపరమ్యంబై మేరుశిఖరిభాతినిబురుషోత్తమశోభితంబై శ్వేతద్వీపంబు కరణిఁ బుణ్యజనానందసమృద్ధిదంబై యలకాపురంబులీలను విబుధమనోరంజకరంబైయమరావతీపట్టణంబువాడ్పున రాజహంసాభిశోభితంబై పద్మాకరంబువై ఖురతటీ
రాప్యవాణీప్రచురంబై సత్యలోకంబనవొప్పు నప్పుడు. 225

సీ. గొడియబీగములావు గొలుసులాసపలియద్దు, మాత్రాసుబోల్తలుపులుమగులుగొడు
గాయుధావ్యంబుల గుణఘటీముద్రిచ్ఛ్యాయుత్త్ర, శరి శింజినీమధురకలశోఁటూళ్ల.

మిద్దెచిల్లరలు వత్తెడుదుకాణముబచ్చు, మళిగెబొక్కసపిల్లుమచ్చులుం(దుల
కపణముల్ నాణెముల్లలకట్ల పంచిగో,తమ లెక్కకడితెంబు దడము భరణి
తే. తక్కిడి సమస్తవస్తుపుల్దనరునటుక, బావినుగ్గులకచ్చెల పాడిపసుల
గాడిజాలాది దివెగూడుగాబుతొట్టి, యొప్పుధనచిత్తుఁడను శేరి యుండునచట. 226
సీ. జాజికాయలు రాస్న జాపత్రియయు హరిద్ర, నాగర గంధక నాభిరసము
లతిమధురంబు దుత్తాభ్ర కైలాశిలా, జిత్తులు మురదారుసింగుహింగు
వన్న భేదియు వస యక్కలకర పంచ, లవణచవ్యములు బోళము మణిశిల
పిప్పళ్లు కోష్టువు పిప్పలీ మూలంబు, హరిదళ నాగకేసరము లింగి
తే. లీకము సదాపవేళ్లు ధాన్యాకములును
గటుకలోహిణి పటిక జంగాలపచ్చ
కర్పరియుఁ గారవియు రేణుకమతి వసయుఁ
దాళకము మాంసనఖము నేపాళములును. 227
తే. క్షారపాషాణములునభ్రికంబు లైదు, గ్రంథితగరంబును యవానికాద్వయంబు
కచ్చురములుమరాటిమొగ్గలు కపిత్థ, కుసుమములు కుందురుష్కము లెసఁగఁగలవు.
సీ. గంటుభారంగియుఁ గంకుష్ఠమును మెంతి, మంజిష్ఠి జిలకఱ్ఱ మాత్రినిపసపు
విషకంటకాలాష్ఠవేతసంబును నీరు, చించలంబును బులిచించలంబు
జీరకంబును నల్లజిలకఱ్ఱ పుష్కర, మూలంబు కాంపిల్యమును సముద్ర
ఫేనంబు ధాతకీనూవంబు సానువు, లుప్పులులును గజపిప్పలియును
తే. గాక మాచియు స్థౌణేయకంబు చిత్ర, మూల గోరోచనములుఁ గాపోతతార్క్ష్య శ్రీ
శైల సౌవీర రసముఖాంజనములు వెలి, గారమును గల్గి యుండు నవ్వేరియింట.
వ. మఱియును. 230
సీ. వింతగాఁ బుంజీభవించి నానాధాన్య, ములరాసు లుండెడి నిలయములును
సకలరత్నాకరస్థలము లై యేకీభ, వించి విస్మయ మిచ్చు వేశ్మతతులు
నఖిలదేశంబుల నమరు నాణెములపుం, జీభవించిన చిత్ర గేహములును
జీనిచీనాంబరానూనబృందంబుల, మందీభవించిన మందిరములు
తే. సర్వరసవర్గములు టంకసాల ద్రేయు, చావడి హామాదినుసు మేలు సరకుఁగలిగి
నాల్గుదిక్కుల్లపేటల నగరజనుల, కలర నమ్ముచు ధనచిత్తుఁ డచట వెలయు. 231
క. వానికి వసుమతి యనఁగా, మానిని విలసిల్లు నొకతె మదనునిచే నా
నావసుమపూజిత మగు, చీనిజము దాళి యనఁగఁ జెలువు దలిర్పన్. 232
ఉ. అబిడమోము గోముజిగి యాబిడముద్దులకావిమోవిరం
గాబిడ కప్పుగొప్పు సొగ సాబిడ నూఁగలకోపు చూపు జ



గాబిడ గబ్బిగుబ్బసిరి లాబిడ లేయనదైనకాను సొం
పాబిడ యూరుతీరు చెలియా వచియింపఁ దరంబె యేరికిన్. 233
క. అలరుం బ్రాయపుఁజిన్నెల, కలిమిన్ రంజిల్ల మెఱుఁగుకరుగునఁ బోయన్
విలసిల్లు నటనపుత్రిక, పొలుపున నవ్వీటిలోనఁ బొలఁతుక మెఱయున్. 234
చ. పొలఁతుకవేణి కృష్ణతను బూనినయంతనె మోము సూడుచేఁ
దలకి విధుస్థితిం దనరెఁ దాళిక చన్నులు నచ్యుతాకృతిం
బొలిచె సహింపలేక నడుమున్ హరిరూపు వహించె నిట్టివా
ర్తలకు మధుద్విషత్త్వమును దాల్చెను జక్కెరలొల్కు మోవియున్. 235
సీ. కులగోత్రములవారి నిలిపి కట్టైలు నీళ్లు, మోయించుచుండెడు ములుచఁదనము
తనుగన్నవారలఁ దన్నిత్రొక్కక నిల్చి, చెలఁగి పంకావాప్తి చేర్పు సూడు
వినుతకళాఢ్యుఁడై ద్విజరాజు నవిశంబు, దోషాకరుని జేయు దూషణంబు
ఘనరసస్థితిఁ జెంది తనరు మానససీమ, బహుభంగములఁ గూర్చి ప్రబలు నగడు
తే. బ్రహ్మ వారించికొనియె నప్పద్మనేత్ర, కలీరు కుచశైలములును హస్తాంబుజములు
నవ్యముఖచంద్రబింబంబు నాభిసరసి, మెఱయఁ గౌశల్యశక్తి నిర్మించిమించి. 236
క. అంబుజముల బింకంబులఁ, గంబుల నగు నయనయుగము గళముఁ గుచంబు
ల్బెంబులఁ గ్రొంబ గడంబుల, డంబుల నిరసించు నప్పడంతి బెడంగుల్. 237
క. డాలా మెఱుఁగులు గ్రొంబగ, డాలా నెత్తావిమోవిడంబులు కోదం
డాలా కనుబొమ లతనుని, డాలా వాల్చూపు లన మిటారి రహించున్. 238
ఉ. గుబ్బలనీటు మోమువస కుంతలబృందమునిగ్గుఁ గౌనులో
జబ్బుదనంబు గన్నుఁగవచందముఁ జెక్కులతేటమోవినున్
గబ్బిచకచ్చకల్ రదనకాంతి కటిస్థలియుబ్బు గంధరం
బుబ్బుర మారుతీరు దరహాసము హాసము డంబు చూడఁగన్. 239
తే. దానిసొగసొత్తులో మెచ్చి, తలఁ గదల్చిఁ కేరిమీసంబుపై ముద్దుకేలు వైచి
యడరి నిటూర్పువెచ్చి యయ్యారె యనని, మానవుఁడులేఁడు ధారణిలోనఁజూన.
క. అటువంటిరూపరేఖా, పటిమం దనరారియుండు భామిని రతులన్
ఘటియింపక పరతరుణీ, విటుఁడై ధనచిత్తుఁ డెపుడు వెలయుం జెలియా. 241
తే. అటువలె నిజాధినాథుఁడు డన్యమృగదృ
గానుకూల్యాగ్రచిత్తుఁడై యహరహంబుఁ
దిరుగఁ దనమీఁద వసలేని తెఱఁగుఁ జూచి
వసుమతియుఁ గాంచె జాశాంకదాహనంబు. 242

క. పతి నడచునట్లు నడచెడు, సతియ పతివ్రతయటం డ్రు సజ్జనులనుచుం
బతి పరదారలఁ గూడిన, సతి జారులఁ గూడఁ దోడఁగె సతతము వేడ్కన్. 243

తే. ఇటుల నావైశ్యదంపతు లేవురేఁగి, మనసు లెచ్చోటఁ గల్గిన మరులు కొల్పి
నెరిమరునితూపు తమచూపు నిర్గమంబు, నెట్టి మరచివ్వకేగుదు రెట్టులైన. 244

క. ఈతీరు కొంతకాలము, నాతియుఁ దానును బరేచ్ఛ నడచుచు నొకనాఁ
డాతతమదనశరాహత, చేతఃకంజాతుఁడై నిశీధిని వేడ్కన్. 245

క. అత్తింటికోడలికిఁ గా, హత్తుక నతఁ డుండె నొకయువాగ్రణికొఱకై
యత్తన్వి యటకె పోయినఁ, జిత్తజుఁ డెసకొల్పె వారిచిత్తము లలరన్. 246

తే. తాను గోరినకన్య యీతరుణి యనుచుఁ, జేరె నాసక్తిచే ధనచిత్తుఁ డప్పు
డాయు వాగ్రిసరుం డితఁ డౌ నటంచుఁ, గదిసె వసుమతి యత్యంతకాంక్షతోడ

వ. అయ్యవసరంబున. 248

మ. సహసాసంఘటితస్తనగ్రహణసంజాతాంగరోమోద్గమం
బు హఠాచ్చుంబితపాటలాధరముఖాంభోజాక్షిగండంబు డు
స్సహనీవీచ్యుతికంచుకావృతినఖాంచద్దంతగాఢక్షతా
వహనం బిర్వుర కయ్యె సంగమము దిగ్వ్యారార్పితేక్షాళియై.

క. కలయికల నాఁటిజంబులఁ, గులసతిఁగా నతఁ డెఱింగెఁ గోమలి మగఁ డీ
యలఘుఁ డని తెలిసె నపు డెట్టు,వలె నచ్చెలి బొంకవలయు వనితా చెపుమా. 250

తే. అనిన హేమావతీభామ హంసదిక్కుఁ, జూచి యదియెటు బొంకెనో చోద్యమహహ
తెలియఁగాఁ జాలనిదినీవె తేటపడఁగ, దెలుపు మనిపల్కి రాయంచ తెలుపఁ గనియె.

క. ఆవేళ నాయకుఁడు కో, పావేశహృదంబుజాతుఁడై యీనిశిలో
నీవిటకు నొంటి నేటికిఁ, గావచ్చితి వనుచుఁ గినియఁ గామిని యనియెన్. 252

తే. మగఁడ నామీఁద నీకింతమమతలేని
తెఱఁగుఁ గన్గొని కాళికాదేవి కేను.
బడుచుఁదనమున మ్రొక్కితి నాపతిని రతికిఁ
గూర్ప నీసేవ సేయింతుఁ గోర్కిమీఱ.

క. అని వేఁడుకొనిన యప్పుడె, ఘనకరుణామృతకటాక్షగరిమను గాళీ
జనని నను జూచి యో పతి, సెనసెద వనునింతలోన నిటు నెత్తిగితి నిన్

ఉ. వింతలు కాళికాజనని విశ్రుతసత్యములంచుఁ బల్కుఁగా
వంతకుమున్న యచ్చెలియకై చను దెంచిన జారుఁడిపోక్కఁగుఁ



జాంతరసీమ నుండి యిది యౌ నిజ మంచు వచింప వర్తకుం
డెంతయు విస్మయాకులితహృత్పటుఁడై నిజభార్య నున్నతిన్. 255

తే. స్తుతులఁ గరఁగించి సాష్టాంగ నతులొనర్చి, గ్రుచ్చికౌఁగిటఁ జేర్చినికోర్కు లలర
జేసెదనటంచు బాసలు చేసి సతిని, దొడరి ధనచిత్తుఁ డింటికిఁ దోడితెచ్చె. 256

క. అది మొదలుగఁ బరభామలఁ, గదియక ధనచిత్తుఁ డెపుడు కాంతామణికిన్
ముద మలర వశ్యుడై తగఁ, బొదివెను నీ కట్టినేర్పు పొసఁగినఁ బొమ్మా. 257

క. అనవిని నాసికఁ దర్జని, యునిచి కడుశిరంబు ద్రిప్పి యోహో చిత్రం
బని తెల్లవారుచుండుటఁ, గని హేమావతి వియోగకలనం జనియెన్. 258

వ. అని ప్రత్యుత్పన్నమతి చెప్పిన విని సంతోషించి నలుం డాతరువాతివృత్తాంతంబు
జెప్పు మని ప్రార్థించిన. 259

మ. స్మరవాత్సల్యవిశేషరక్షితపనీమాతంగమాతంగసం
హారయోషిన్నుత పాదపంకరుహశోభాభంగభాభంగభా
స్వరసర్వామరవాహినిచిత్రజలరుట్సారంగసారంగరా
ణ్ణిరవద్యస్తుతిజాతముత్ఫలకవన్నీలాంగనీలాంగదా.

క. నవనానవ జగదవనా, దవనామ విషాగ్నిహరణ దారుణ భువనా
భువనాధిపనుత సవనా, సవనాభ్రద్యుతిజితార్కజాసరసవనా. 261

పృథ్వీవృత్తము. కులాచలకులాచలావలయకూటఘోణీఫణీట్
తలాతలతలాతలాది జగదభ్రిదిగ్దార్ఢ్యవ్యా
త్కశాధరకశాధర ప్రబలకార్ముకారోపకృ
త్కశాధరయిలాధర ప్రతిమధైర్యచర్యాకరా. 262

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్రపవిత్రాయ్యలరాజాన్వయసుధావార్ధిపూర్ణిమా
చంద్ర నిస్సహాయకవిత్వనిర్మాణచాతుర్యనిస్తంద్రశ్రీరామనామపారాయణనారా
యణామాత్యప్రణీతం బైనహంసవింశతి యనుమహాప్రబంధమునందు ద్వితీయా
శ్వాసము.

---

శ్రీ ర స్తు

# హంసవింశతి

తృతీయాశ్వాసము.



జానకీక్షణోత్పల
రాజా రాజాధిరాజ రాజన్నిజసే
వాజాతహర్ష మునిజన
తాజలరుహచండధామ దశరథరామా. 1

వ. అవధరింపుము ప్రత్యుత్పన్నమతి నలరాజ్యునన కిట్లనియె నట్లు ప్రభాతసమయం
బుగా వచ్చినం గనుంగొని. 2

మ. చని పూఁజప్పర మొప్పుచుండెడు మణీసౌధంబులోఁ గెంపుటా
మొనముక్కుల్గలపచ్చటాచిలుకకో ళ్లొప్పొందు బంగారపుం
బనిరంగారెడుతూఁగుటుయ్యలపయిన్ బాగొప్ప మేన్సేర్చి యా
వనజాతాక్షి దినాంతవేళ మనుజస్వామిస్పృహాధీన యై. 3

చ. మిడిగలవజ్రపున్ రవల మిన్కులకమ్మలు జాతికెంపుటా
కడియములున్ సుపాణులచొకాటపుహారములున్ మృగీమదం
బడరెడుపట్టుచీరసొగసౌ ననఁ దాల్చి నృపాలు కేళికిన్
నడిచె వధూలలామ తమినాటినచిత్తము తత్తరింపఁగన్. 4

క. అరెయెడ హంసకులాగ్రణి, యాయోషామణిని గాంచి యనుపమవచన
శ్రీయలరఁగ నొకచిత్రో, పాయపుఁగథ విను మటంచుఁ బలికి వచించెన్. 5

---

## తొమ్మిదవరాత్రికథ.

ఉ. సాలము మిన్నునంటె ఘనసంపదఁ గాంచె నగర్త యీర్ష్యచేఁ
దాళ కనంతభోగములు తద్దయుఁ బద్దునఁ దాను జెంద నా
మేలనఁ గోట యున్నతియు మిక్కిలి ఖేయము లోఁతు గల్గి శో
భాలలితం బనంగ నొకపట్టణ మొప్పు నితంబినీమణీ.



క. ఆవీటిలోన రంగా, జీవకులాంభోధి పూర్ణశీతమయూఖుం
డై వెలసి చిత్రఘనుఁ డనఁ, గా వార్తకు నెక్కి యతఁడు కాఁపుర ముండున్.

తే. హరితహారిద్రకృష్ణరక్తావదాత, శబలపాటలధూమలశ్యామకపిశ
వర్ణములఁ గూర్చి చిప్పలవాగెలునిచి, చిత్తరువు వ్రాయుగుళ్ళలోఁ జిత్రఘనుఁడు.

క. సురవిద్యాధరకిన్నర, గరుడోరగసిద్ధసాధ్యగంధర్వహరి
ద్వరయక్షాసురనలినజ, హరిహరసత్యర్షివరుల నతఁడు లిఖించున్.

సీ. హరికరిమృగఖడ్గకిరితరక్షుద్వీప, సైరిభగోకర్ణశరభచమర
గంధర్వరోహిషగవయభల్లుకరామ, శశజంబుకోష్ట్రాశ్వశల్యకోక
వామీఖరోరణశ్వానాతుకపిబభ్రు, సరటేర్కలూతాఖుసర్పమకరి
శతపదిబస్తమత్స్యడులీకులీరాళి, గాధేయరక్తపాకమఠనక్ర

తే. గోమహిషజలశుక్తిచిక్రోడములను, సింగిలీకాలురయుమింద చెలిదిపురువు
కొక్కువెంట్రుపవలికిరి కోర్ణ లాది, గాఁగలుగు జంతువులఁ జిత్రఘనుఁడు దీర్చు.

తే. గరిమిడిబ్బంది చోఅపంది గాఁడు మంద
గరడ బెగ్గోలురేచు గర్దరమురాళ్ల
రాచిపెంకులజెట్టి పున్నారిపక్కి
పేచిచెక్కలచేరనుపేళ్లఁగలుగు.

సీసమాలిక. గరుడుండు సంపాతి గండభేరుండంబు; చీకురా యాడేలు చెవులపంత
వార్ణెము భైరిజాపళము సాళ్వము డేగ, గూడ బాతుల్లంగి కుందటీల
పాలనారాయణపక్షి పాముల మ్రింగు, డంచవేష్టము గ్రద్ద క్రౌంచ మాబ
లగు లోదె గొరవు తెల్లనిపంతబలసట్టి, గూబ శంబరకాకి గుబిలిగాఁడు
నామాలకేతఁడు నల్లాస కప్పెర, కాకి యంబటిదారిగాఁడు మూఁగ
చిందర లకుముకి చిటుత తీతువకోడి; కొరుకో డేకులనారిగాఁడు
మునుఁగుకోడియు డాలముట్టెకోడియు బోద, పొన్నంగి కక శేటి బొల్లికోడి
గొంగడి కక్కెర గొక్కెర గోరవంక, పూరేలు కనుపెంటి నీరుకాకి
వెలిచె లావుకపిట్ట చిలుక జీనువకాఁజు, పెడిసకేర్జము డబ్బుబెలవ నెమిలి
జిట్టువ మునుగపూజిట్టువ గిజిగాఁడు, వల్లడ పొడిపిట్ట వంగపండు
బరతము కోకిల పసిరికె తంగేడు, గోరవంక జక్కువ చెటువుకోడి
పట్టుజీనువు కొంగ పాపేరు పిచ్చుక, పోలిక పిక్కిలి మాలముచ్చు
చిలుక చకోరంబు జిబ్బిటాయజటాయు, కొండపిచ్చుక వానకోకిలయును
మ్రోనుపొక్కటిగాఁడు మాలకాకి బెనాసి, పాపెర గోరవంక పంది కైర

గబ్బిలంబును జాతకము కంకచిటిచెల్వా, పానుపెంటి మేత్రింత భూతపోతు
గున్నంగి కనకాక్షి గుడిసె బయ్యాకపుల్ల, సీతుప బెగ్గరు జిక్కుతురక. 12

ఆ. పికిలి నేల నెమిలి పెనుగువ్వ బకదారి
పావురాయి సివదు పలుపరింత
చదలుకోడి గువ్వ పదపుతోఁకలవేడి
యాది రైనపక్షు లతఁడు దీర్చు. 13

వ. అదియునుంగాక. 14

ఉ. వానిమనోహరాంగవిభవంబును వానిముఖేందుకాంతియున్
వానిపటూక్తివిస్ఫురణ వానివిలోచనదైర్ఘ్యసంపదల్
వానియురస్స్థలోన్నతియు వానిభుజప్రతిభావిశేషముల్
మానిని యేమిచెప్ప ననమానములౌను తదీయవైఖరుల్. 15

క. ఆతనిగృహమున విద్యా, చాతురికలరారి నృపులాసంగ రహించున్
జాతిహయవస్త్రభూషణ, మాతంగద్రవ్యమణిసమాజము లెపుడున్. 16

క. పౌరుషముఁ దారతమ్యముఁ గారుణ్యము దానధర్మగరిమయుఁ గులవి
ద్యారసికత్వము వినయము, గారవమును గలిగి చిత్రఘనుఁ డట్లలరున్. 17

క. ఆచిత్రఘనున కలవల, రాచవజీరునిజిరాగుజానకు సెనయై
సూచింపఁ దగినసొపసుది, వాచాలి యనంగ నొక్కవనిత చెలంగున్. 18

ఉ. ఆకమలాక్షి చంచలదృగంచలసీమల బెళ్కుతళ్కులా
యాకలకంఠిపల్కు లలరార సుధారస మొల్కుకుల్కులా
యాకనకాంగియంగరుచిహాటకకోటులఁ జిల్కుబెళ్కులా
హా కుటిలాలకా సరసిజాసనుఁడైనను నేరఁ డెంచఁగన్. 19

క. హరు లాపల్కులు తుమ్మెద, గరు లాకచరుచులు నడలు కరులా కదళీ
తరులాతొడ లిందునిభి, త్తరులా గోళ్లెంచఁ బ్రౌఢతరు లాసరసుల్. 20

సీ. మాటలా యమృతంపు తేటలా కపురాల, మూటలా యని జారఁకోటులెన్నఁ
గన్నులా తెలిదమ్మిచెన్నులా మగతేఁటి, యన్నులా యని పల్లవాళులెన్నఁ
జేతులా సుమలతాజాతులా కిసలయ, ఖ్యాతులా యని యుపకాంతులెన్న
గుబ్బలా యపరంజిలిబ్బులా రుచిమించు, దిబ్బలా యని పాంథధీరులెన్న
తే. గోరులా రిక్కసౌరులా కులుకుతళుకు
నవ్వులా జాజిపూవులా నాఁటునీటు
చూపులా వాఁడితూపులా సొలపుదెలుపు
ననుచు విటు లెన్నఁదగు నింతి యతనుదంతి. 21



చ. వగ లిగురొత్తఁ జిత్తరువుఁ వ్రాయుము సారెసు దీనిఁ జూచుచుం
దగ నని పద్మసంభవుఁడు దారదయామతిమీఱ మేలుబం
తిగ నొనరించి తత్ప్రతికిఁ దేకువ నిచ్చినమేటి జాళువా
జిగిబిగిఁగ్రమ్ము బొమ్మ యన సింధురగామిని యొప్పునున్నతిన్.

తే. కురులు ఘనసంపదలఁ జెంది గొమరుమిగుల
ముఖము రాజవిభూతిచే మురియఁ దొడఁగెఁ
గటిమహాచక్రవిభవము గ్గాంచె ననఁగఁ
జెలఁగు వాచాలి గమననిర్జితమరాళి. 23

ఉ. ముద్దులుఁగారు నెమ్మొగము మోహరసంబులు చిందు గుబ్బలున్
దిద్దినయట్టులుండు జిగిఁ దేఁటెదు చెక్కులు కావిమోవియున్
నిద్దపుజాళువాపసిఁడి నిగ్గులు జిల్కు నయారె దేహమున్
దద్దయు నెన్నఁగా వశమె దానినవీనవిలాససంపదల్ 24

తే. దానివగలకు లోఁ జిక్కి దర్ప ముడిగి
దర్పకాస్త్రాగ్నికీల దందహ్యమాన
మానసుఁడుఁ గానివరుఁడు భూమండలమున
వెదకినను లేఁడు సుమ్ము సాధ్వీలలామ. 25

చ. అది తమయూరిజేనళిమునందు దయన్నెలకొన్న భక్తకా
మదుఁ డగురామచంద్రపెరుమాళ్లలరం దిరునాళ్లలోన నిం
పొదవఁగఁ దార్క్ష్యవాహుఁడయి యున్నతితోఁ దిరువీధు లేగఁగా
ముదమున నమ్మహోత్సవపుముచ్చటఁ జూడఁ దలంచి రా నటన్. 26

తే. పరఁగఁ బదియాఱుగుజ్జులప్రభ యొనర్చి, గంటవేదియు బంగారుకలశమెత్తి
కంచుగుబ్బలు రావిరేకలును తోవ, పక్షములు దీర్చి గొప్పచప్పరము రాఁగ. 27

మ. జగతీజ్యోతులు కాగడాలు బలుబంజాయీలు మోంబత్తులుం
బగలొత్తు ల్దివిటీలుఁ దిర్వళిఘులుం బంజాల్మహాజ్యోతులుం
దగ సూర్యప్రభ లాయిలాయులును జంద్రజ్యోతులున్ మైనపున్
జిగటాల్నిచ్చెనపంజు లాగతులు నగ్నిజ్యోతులున్ వెల్గఁగన్ 28

వ. అప్పు డప్పద్మపత్త్రాయతాక్షుని తాదృశమహోత్సవం బేకశరీరంబున నిరీక్షించిన
సంతుష్టి గాదని కాయవ్యూహయోగసామర్థ్యంబున ననేకదేహంబులఁ దాల్చి
భక్తిసంయుక్తి నిరుచక్కిఁ జేరి వీక్షించు సూర్యచంద్రబింబంబులడంబువం
బొల్పుచు వెట్టుగొడుగులు ధవళాతపత్త్రంబులు రాణింప గరుడధ్వజాదివివిధకేతన
జాతవాతాహతి పటురత్నంబున నుండి జాఱిపడుచుండెడు నుడుగణంబుల నడుమున

నక్షత్రబాణపరంపరలు చెలువుమీఱంబాతాళభూతలంబుల సంచరించు సంచున వియత్తలంబునం దారు విహరించం దలంచి విషవహ్నిజ్వాలికలు గురియుచు గగనంబున కెగయు కౌక్షోదరానీకంబులవీక రివ్వురివ్వున నెగిరి చను నాకసపుంజువ్వలు మింటనెఱయ ననంతకోటిబ్రహ్మాండనాయకుండైన పుండరీకనాభుం డేతేరం గనుంగొని ప్రమోదంబున మహావేదండయానలు సేసలు సల్లిన నుల్లసిల్లు వెండి పసిండి క్రొవ్విరితండంబుల పాండిత్యంబునం బలుదెఱంగులబిరుసుల వింజామరల ఫెళఫెళారభటి నెఱయ రాలు సువర్ణవర్ణనీయంబు లగుపూవుమొత్తంబులు భూనభోంతరాళంబులం గప్పి యొప్పుచుండం దదుత్సవవీక్షణకుతూహలసమాగత శుక్ర బృహస్పతి బుధాదులపగిదిం బగులొత్తులువెలుంగ వెండియుం జక్రబాణంబులు నాకాశచక్రంబులుం బిట్టబాణంబులు శతముఖబాణంబులుం దాటబాణంబులు దేలుబాణంబులు గురుజులు కుండబిరుసులు సంపంగిపూలబిరుసులు జక్రబిరుసులుం బంచవన్నెబిరుసులు గజబిరుసులు మొదలయిన బాణవిద్యలవైఖరులు చిత్రవిచిత్రంబుగాం జూపుచు బాణకారులు ముందరనడువ డమరుపురభిడ్డమరు సహచరభయదఢక్కాహుడుక్కారవచానుకలహ పటహ తమ్మటావజనిస్సాణఝల్లరీమర్దళమురజమణాతుత్తుంభికజర్ఝరీ పాశకోశక్రోలు మోరీభేరులును డోలు గౌరు గుమ్మెతమ్మెట వీరణయురుమ యొంటికంటియురుమ పంబజిమిడికతప్పెటగిడి బిడితుడుము చక్కిచుయ్యాంకియునుందాళమహోత్తాళంబులును జేగంట చిటితాళంబులుం జిటికెలు ముఖవీణ శంఖకాంస్యశృంగకాహళంబులును సన్నెగాశెన ఫీరు కరకొమ్ముసాగసరమును నుతిచెంగు చేసన్నాయి సింగినాదము పిల్లంగ్రోవి మ్రోలుం బీకలును వీణె రుద్రవీణ స్వయంభువీణ మనోహరవీణ నారదవీణ బాణవీణ సరస్వతివీణ స్వరమండలంబు తంబుర రావణహస్తంబురవాలుం గిన్నర తిపిరికిన్నర సిద్ధకిన్నర దండె మొదలయిన హృద్యానవద్యవాద్య విశేషంబుల దిక్కులు పిక్కటిల్ల నిర్ఘోషంబులు భోరుకొల్ప నడుగడుగునకు నీరాజనంబులు నేకారతి పంచారతి యుళిఘారతి కుంభారతి శేషారతి గరుడారతి పురుషమృగారతిమంగళారతి యేకదళారతులు కూర్మ స్వస్తిక నభోమంటప రంగవల్లిక లింగస్వస్తిక సర్వతోభద్రగిరి బంధమయూర నాట్యనాగబంధవింజామరవ్యజనచ్ఛత్ర సింహతలాట బృందావన కల్పవృక్ష పాలసముద్ర గంగాతరంగ శంఖచక్ర పద్మంబు లనుపేరు గలిగిన ముగ్గులు మాణిక్యమౌక్తిక ప్రవాళ మరకత పుష్యరాగ వజ్ర నీల గోమేధిక వైడూర్యంబు లను నవరత్నంబులం దీర్చి పుణ్యభామినులెత్తుచుండ దశాంగగుగ్గులు సాంబ్రాణిసజ్జరసశ్రీవాససరళ యావనవృక్షధూపంబులు ఘుమ్మురను వాసనలుం గ్రమ్ముకొనం బళ్ళెపుభాగంబులం బరమభాగవతోత్త



ములు శ్రీవైష్ణవులుం గులశేఖరులం ద్రైవర్ణికులు యతిరాజవింశతి పూర్వదినచర్య యుత్తరదినచర్య క్షమాషోడశము శఠగోపస్తవము శ్రీగుణరత్నకోశము ముకుందమాల యష్టశ్లోకి చరమశ్లోకి యాళవందారుస్తోత్రముం దిరువాయిముడి తిరుమంత్రద్వయ చరమశ్లోకంబులు మొదలయిన ద్రావిళపాత్రప్రబంధములు ప్రపత్తిపూర్వకంబుగాం బ్రసంగింప స్థల పరస్థలంబులనుండి చూడవచ్చిన బ్రహ్మక్షత్రియవైశ్య శూద్రులునుం గోమటి కమ్మ వెలమ వేకరి పట్రగొల్లబలిజ కుమ్మర వలగండ బెస్తల చిప్పె కమ్మరి వడ్రంగి కాశె కంచరయగసాల పడసాలె సాలెన సాతని కటిక భట్టుజెట్టి జాండ్ర తొగట గాండ్లవారును జిత్రకార వందిమాగధవైతాళిక జైన ఘూర్జర గౌడమిశ్రులును భేరి భళియ ఘటికి సృగాలక చత్రజాతులును బోయయెఱుకు చెంచు యేనాది జిలగరి వానివన్నె గట్టి రంబళి యీడిగె మేదర వీరముష్టిమాష్టియొడ్డె యుప్పరులును నసిధావక మైలారి తురక పింజారి విప్రవినోదులును జాతికర్త దొమ్మరి డొమిణి బొమ్మలాట వారును నింద్రజాలిక మహేంద్రజాలిక హస్తలాఘవసూత్రనాటక క్షౌరక రజకులును బోగమువారును దెరనాటకపుజంగాలును జంగాలు బిద్దమువాండ్రు తెల్లకోకబత్తులు సివసత్తులు మత్తులు పలునాటివీరులు పరిహాసకులు సుద్దులకుమాళ్లు కొమ్మారిదాసళ్లు తవిరుదాసళ్లు కోణంగులు సేవకులు పరసలు పడిగెవారు కంచికావళ్ళవారు పరంగు లింగిలీసులు పఠానులు వలందలు సన్యాసు లేకదండ త్రిదండు లేకాంగులు వానప్రస్థులు యోగు లవధూతలుపరమహంసలు బైరాగులు జటాధారులు దిగంబరులు గోముఖులు నియమస్థు లూర్ధ్వబాహులును గోరడజోగులు కాటిపాపలు మందపిచ్చులు పిచ్చుగుంట్లు చర్మకర్ములు చండాలమాతంగులు తలక్రిందు జోగులు రామగోవిందులు మొదలగు వారును బురోభాగంబున నేల యీనిన చందంబున వెల్లివిరిసిన చాడ్పున నుసుళ్లవిధంబున మిడుతగమిలాగున బేడిసెకదుపుభంగిని యాకుం జిలుకలమొత్తంబువంతునం బెరయీగలపగిదిని స్వాతిబకంబుల వీకను గంగాతరంగంబులకైవడి జలబుద్బుదంబులవైఖరి వర్షధారలపోల్కిని రామరావణబాణపరంపరలరీతినిం బుంఖానుపుంఖంబులుం దండోపతండంబులు లక్షోపలక్షలు శాఖోపశాఖలుం గోటానకోటులు సంఖ్యాతిసంఖ్యలుగా నడుచు సమయంబున. 29

క. నెఱిఁగంట మాళ్లిఘనుదు ని, ద్దఱుమంచి కుమాళ్లుగలుగఁ దయచేసినయో
పెరుమాళ్లని యావాచా, లిరుమాళ్లనొసంగి మ్రొక్కి యేగుచు నుండన్. 30

క. ఆయెడ వర దత్తుం డను, కాయజరేఖా సమాన కలితాకారుం
డా ఘంటి యున్నచక్కటిం, బాయక నిల్చుచుండి బానిసై మోహమునన్. 31

ఉ. కందువమాటలాడి వగకారితనంబులుసూపి సన్నలం
పొందఁగసల్పిచేరికల నల్ల మురంజిలఁజేసి తమ్మలం
బందఁగనిచ్చి మెచ్చి భుజమందుఁగరంబిడి నవ్వుచేష్టఁగే
ళిందమిరేఁచి గుబ్బలు భళీయని నల్చిరతైకచిత్తుఁడై. 32

క. ఆవాచాలిని సంకే, తావాసమ్మునకు రమ్మటని ప్రార్థింపం
గావలచి మనసుమెత్తని, దైవానిమనోభిలాష మరలం దీర్చెన్ 33

క. అదిమొదలు సుదతి మదమునుఁ, బొదలఁగఁ దుదలేనిమోహములకాస్పదమౌ
మదిని ముదంబులు గుదిఁగొన, మదన ప్రదర ప్రభగ్న మర్మస్థలియై. 34

చ. చవిఁగొనిజారవీరవరసంగమ సంగ్రహణక్రియా మహో
త్సవ పరిశుద్ధబద్ధఘన తద్ధిత బుద్ధిని సంచరింప న
య్యువిదకునొక్కపుత్త్రుఁడు సముద్భవమొందె మఱంతనైనఁ
ల్లవసురతంబ సహ్యాతఁ దలంపక యెప్పటి యట్ల సల్పఁగన్. 35

ఉ. సొంపుల నింపుచిత్తరువుఁ జూడఁగ వచ్చితిమంచు వేడ్కమో
హంపువయస్సుదిచ్చటికి నై పఱతెంచె నటంచు మీదె యీ
సంపదలుల్లసిల్లఁ ఘన సద్మవటంచును దానికోసమై
గుంపులు గూడి వీటివిట కోటులు వత్తురుబోఁటి యింటికిన్. 36

క. ఈలాగు జారకోటికి, మేలౌ నభిమతముఁదీర్చి మెలఁగుచు నుండే
కాలమున నొక్కనాఁ డొక, జాలుండను విటుని బిల్చి సంధ్యావేళన్ 37

తే. పురమువెల్వడి కాళికాపుణ్యభవన, సీమ సంకేతమటకీవు చేరు మనుచుఁ
జెప్పివాచాలి పతిలేని చొప్పుఁ జూచి, పుత్త్రు నిద్దురఁబుచ్చితాఁ బోయెనటకు.

తే. పోయి యాకాళికాలెల పొంత నిలిచి, కటికి మబ్బున నలుదెస లలయఁ జూచి
జాలుఁడాచాయ లేకున్న సంశయించి, మనసుదెలియంగ డాఁగెనో యని తలంచి.

ఉ. చీమచిటుక్కుమన్న వినుఁ జిమ్మట బుట్టిననేగునంతలో
నేమురమంది చూచు సరణిం బశుపక్షిమృగాదిజంతువుల్
వేమఱుఁబోవుచప్పుడులు విస్మయమందఁగ నాలకించు నా
హా మతిరాకతక్కెనె యటంచుఁ దలంచు వియోగవేదనన్. 40

క. ఏరా తాళఁగలేరా, రారా వన్నెచనేల రారా రాపుల్
మేరా మోహనరూపశ, రీరా యటుడాఁగి పల్కరింపవదేరా. 41

మ. అనివాచాలిప్రియంపుఁబల్లవుని డాయం బిల్వఁగా మోఁచియు నా
ర్ధ్వను నాలించి నిజాంగనాగళరవవ్రాతం భిదా నిశ్చయం
బమరం దద్విభుఁ డప్పుడొక్కపనికై యాదారిగాఁ బోవుచుం
గనియుల్లోటికిఁ జేరఁదీపసుచుఁ బల్కంగ్రాఁతతావంటటన్. 42



క. ఎటువలెబొంకఁగవలెనో, కుటిలాలకనీవు తెలిసికొమ్మ నియనఁగా
నిటునటుఁ జూచిది తెలియదు, పటుసూక్తిని నీవె తెలుపు పత్రిప యనినన్. 43

క. ఆమాన శోకమప్పుడు, హేమావతికనియెఁదను నిజేశుండడుగన్
భామినిధైర్యము వదలక, తామగనికినియె వేడ్క దనుకొత్తంగన్. 44

ఉ. అయ్యలు సందెవేళఁ జనియాడఁగ నింటికిరాక తక్కతే
నియ్యెడనీదువెంటఁ జరియించుచు వచ్చెనో యంచు భీతిచే
నుయ్యలలూగుప్రాణముల నోర్వక చీఁకటి వీటఁజూచితే
నెయ్యడ లేఁడు చల్లనిఁక నేమియొనర్తు మనోహరాధిపా. 45

క. అనివాపోవుచు సతిప, ల్కనవిని యాచిత్రఘనుఁడు కినుకెడలి దిగుల్
గొనిమనసువకావకలై, చనఁజెడితినె శేగెనంచు సతితో ననుచున్. 46

తే. నగరమునకేగి యిద్దఱు నాల్గువీథు, లరయుచుండంగ వాచాలి యంతలోన
భవనమునకేగి చనుదెంచి భర్తతోడ, వేడ్కలిగురొత్తఁ జెప్పెను వింతగాఁగ. 47

క. నేనింటికేగిచూడఁగఁ, దా నిద్రాసక్తిఁ బూనితనయుం డున్నాఁ
డో నవ మదనాకృతిని, మానినిదోడ్తెచ్చెమగని మందిరమునకున్. 48

తే. అట్లు తోడ్తెచ్చి నిద్రించు నసుఁగు సుతుని, లేపి ముద్దాడుకొనుచుఁ దొల్లింటియట్ల
చిత్రఘనుఁడును వాచాలి చిత్తమలర, నిండుమోదంబున సుఖాసనుండి రపుడు.

క. ఆరీతి నేర్పుగలిగిన, భూర మణుని జేరుమనుచుఁ బులుఁగులదొర తగ
జీరఁగ హేమావతి విని, యౌరా చెలియాగడం బటంచు గణించెన్. 50

క. ఈరీతి కథనుజొక్కప, యోరుహముఖి మెచ్చు నప్పు డుత్ఫుల్ల త్వం
కేరుహ గంధానిల మరు, దేరఁగఁ దెలవారవచ్చె దృఢమని యంతన్. 51

సీ. పట్టెమంచము మెత్త పయిఁదలగడబిల్ల లగరుధూపముదివ్వె లడపముచిటి
చాపజాబిల్లికె సానపువ్వులచెండ్లు తబుకు దంతపుగద్దె తావి కుడుక
గొడుగుపావలు గంధ వడిపెట్టె గంధపుగిన్నె సున్నపుకాయ గిండి సురటి
తంబుర నిల్వుటద్దము తమ్మపడిగము వీణకస్తురి రుద్రవీణ పునుఁగు

తే. కరవటంబాకు సంబళి కప్పురంపుఁ, గ్రోలిబాగాలు బకదారి గూండ్లుఁడనరు
లొవతీనెలు చిత్తస్వతీవిఁవనను, కేళినిలయంబుఁజేరె నక్కీరవాణి. 52

క. చేరి దినాంతంబైనన, నేరుహశరకుసుమచాపనిర్ముక్తశరా
సార మొకయింతసైఁపక, భూరమణీరమణుఁజేరఁ బోయెదు బుద్ధిన్. 53

సీ. జలదావళిరహించు చంచలాలతలన వేణిఁగైతకదళశ్రేణి మెఱయ
దినవిభాంకురముమైత్రిని దన్మిఁజేరెనాఁ, గాశ్మీరరేఖచత్త్రిమునఁదనర
జయశంఖమునకు ముత్తియపుఁజిల్లులు వేసె, మరుఁడు నాగళమున సరులుదూఁగఁ

బుప్పగుత్తులఁ గప్పుపుప్పొడి యనఁగ, నడిపొంత గుబ్బలఁ బరిమళింప
తే. రమ్యమేఖలఘుళుఘుళల్ రత్నహేమ,కలితనూపురఝుళఝుళల్ చలువవలువ
ఘళిఘళిల్ గిల్కుమట్టెల గిలగిలల్ ర, హించ రాయంచకడ నిల్చెఁ జంచలాక్షి. 55
తే. నిలిచి హేమావతీనామ జలరుహాక్షి, హంసకులపట్టభద్ర నేఁ డైన మాన
వేంద్రుకడ కేగుమని సెల విమ్మటన్న, శిరము గదిలించి రాయంచ చెలయ కనియె.
శా. ఆకారత్నపుబొమ్మ సొమ్ములివి లెస్సాయెన్ దుకూలంబహో
చొక్కంబై తగెఁ బుక్కపూతసుమముల్ సొంపారెసేబాసు నా
దిక్కుం జూడు శిరోవిధూననము సంధిల్లన్ వచోమాధురిం
జొక్కం జెప్పెద నొక్కగాథ విని మెచ్చుల్ మెచ్చి పొమ్మంతటన్. 56
క. అనుచున్న హంసపలుకులు, వినుచున్ నళినాక్షి పలుకు వినియెద నని తన్
గనుచున్నఁ దేనె ధారలు, పెనుచున్ నవభణితి నపుడు బిసభోక్త యనెన్. 57

---

## పదియవరాత్రికథ.

క. వినుము సుధానిధి యనుపే, రునఁ గృష్ణాతీరమందు రుచిరోన్నతకాం
చనగోపురాధరీకృత, ఘనగోపురమైనపురము గలదొకటి సతీ. 58
సీ. సౌధకేళద్వధూ జనదత్త ఖనదీబిసాహార తుందిలహంసచయము
హితవయస్యాసమర్పితకల్పతరుసుమస్రగ్వ్యాప్తసౌధయోషాజనంబు
సాలశృంగగశారికాళీపునఃపునః, పఠిత నిర్జర సతీభాషణంబు
జనకార్పితోగ్రాప్తవనభూజఫలపృద్ధ, భర్మగోపురశుకీపైక గణము
తే. మందిరవిటంకకలరవామందకలక, లారవప్రతిరావకార్యమరనాథ
కేళికాగారమణి కుడ్యవాళికంబు, దనరువస్తుసమృద్ధంబు తత్పురంబు. 59
వ. వెండియు నప్పురంబు విబుధరాజ మనోరంజకంబై సుధర్మాస్థానంబు వైఖరి బురు
షోత్తమాధిష్ఠానంబై మెఱుపుపోలికిని రాజశేఖరకుమారాధీనంబై యమర
సైన్యంబు శేవను జనసమృద్ధంబై యలకాపురంబు చాడ్పున నొప్పుచుండు. 60
క. కరితురగరథభటోర్వీ, సురభూవరవైశ్యశూద్రశుభసౌధాళీ
వరణజలఖేయతరుణీ, పురుషోపవనాదిగరిమఁ బుర మది వెలయున్. 61
ఉ. భూతియుఁ గావిబొట్టు మెయిఁ బూనిన మాల్కెలునుక్కుకల్కెముల్
చేతఁ గడెంబుఁ దాయెతులఁ జేర్చినమందులు మంత్రతంత్రకో
పేతపునాగబెత్తమరఁ బెట్టెలు నొప్పఁగ రౌద్రకర్ముఁడన్
భూతచికిత్సకుండొకఁడు పొల్పుగ నచ్చటనుండు మానినీ. 62
సీ. పైగాలిసోకినఁ బాఱుఁ బిశాచక, తండంబు లెల్లను దల్లడిల్లి
పొలఁకువఁ దనుఁగొన్నఁ బోపుదయ్యంబుల, విసరఘుల్భితిచే విస్తరిల్లి



పేరువిన్నప్పుడే మూరమైచను భూతచయములు దిగులున సరభసిల్లి
తొడరి నిల్చినయంతఁ దొలఁగు దుష్టగ్రహ, ప్రచయముల్ భయమునఁ బరిఢవిల్లి
తే. యుఱుకు నారౌద్రకర్మునికరము సోఁకఁ, బేరితభేతాళమోహినీ పిశితభోక్త్ర
కామినీ శాకినీ ఢాకినీ మదాంధ, భయకరబ్రహ్మరాక్షసుల్పల్లటిల్లి. 63
క. క్రూరగ్రహచోరగ్రహ, చారగ్రహ కూర్మశాక చండిగ్రహకా
శేరిగ్రహాంతరగ్రహ, వారిగ్రహములును బోవు వానిఁ దలంపన్. 64
క. వెలగల రావుల మఱ్ఱుల, వెలుగులఁ బాడిండ్లశూన్య విపినస్థలులం
గలుఁగుల నిలువక తొలఁగును, పలయకభూతములు వానిమంత్రోద్ధతికిన్. 65
క. ఈలాగు మంత్రమారుత, తూలతృణీకృత సమస్తదుష్టగ్రహుఁడై
యాలోకాలోకాంచిత, భూలోకఖ్యాతి నతఁడు పొలుపొందు సఖీ. 66
తే. వానిప్రియురాలు విరివాలుఁ బూనజాలు
ఱేఁడు తమినేలు జవరాలు రేఖఁబోలు
మేలుగల జాళువాడాలుఁ గ్రాలు ముద్ద
రాలు ఘనురాలు పేరు నవ్వాలుఁ గంటి. 67
క. కుందనపుబొమ్మ తేనియ, చిందెడు క్రొవ్విరులకొమ్మ శృంగారము చె
ల్వొందెడు గుమ్మ శుభాకృతిఁ, గందర్పుని కమ్మ దానికథ విని పొమ్మా. 68
తే. వాలుమీలఁ బోలువామాక్షి చూపులు, సోము సాము గోము భామమోము
మించు మించు సంచునెంచుమై దులకించు, మిన్నుచెన్నుఁ దన్ను సన్ననడుము.
మ. భళిరా ముద్దుమొగంబు తేటలవురా పాలిండ్లసొంపద్దిరా
బెళుకుంగన్నులసోయగంబు కటిబల్బింకంబు సేబాసురా
కులుకుం జెక్కులనిక్కు మిక్కుటపుఁ డెక్కుల్బల్చొకాటంబురా
తలరా దీనికి సాటిలేదని విటుల్ తన్ మెచ్చ బోఁటొప్పగున్. 70
చ. ఘనకనకంపుసొంపుగల కాయము కాయజుతూఁపు రూపులన్
జెనకిన చూపు కజ్జలవివేషముతోషముఁ జిల్కుపల్కులుం
దనరు నవీనసూనముల నవ్వెడు నవ్వులు తేనెసోనజా
ల్వాను పెనుతావిమోవి యల కోమలికే తగు నొప్పు చెప్పఁగన్. 71
క. నెలరా మొగమును నునువె,న్నెల రాజీవాక్షి నవ్వు నీలపురా వ
న్నెలు రాజిలు బలుకీల్జడ, నెలరాలజయించు మిగులనెలఁతనఖంబుల్. 72
క. నెఱికురులగుఁ గంధరములు, ధరములకన్నన్ గుచములు తగనుందరముల్
దరముల సిరి బిత్తరముల్, తరమె లతాతన్వి గళము ధర వర్ణింపన్. 73

క. ఇటులఁ మలలేనిరేఖా, పటిమయు యౌవనముఁ దనరఁ బతిపైని రుచు
ల్పాటమరిల కన్యపురుషుల, ఘటియింపం దొడఁగె రతికిఁ గామిని వేడ్కన్. 74

సీ. ఏనాఁటి కేపాప మెఱుఁగనికన్నులకిడియెఁ గాటుక రేఖ లేపుగులుకఁ
బుట్టిపుణ్యా మెఱుంగనట్టి నెమ్మేనికిఁ, బసపున్గుఘటించె మిసిమి బెళుకఁ
గలనైనఁ బంకించి కలయమవ్వని వెండ్రు, కలుదువ్వి కొప్పిడెఁ జెలువమొలుక
నెన్నఁడుసొగసేనియెఱుఁగని గుబ్బల, కలరించెఁ గంచుళివలపుచిలుకఁ

తే. బూర్వమెకాలమందైన మునుపఁగనని,
విరిసరులుఁజుట్టెఁ గ్రొమ్ముడి సిరులుదొలుక
నునుటవిటకోటి నెన్నెటిమదము నాఁటి,
యాఱజమువించి యాచంచలాక్షియపుడు.

ఉ. పాటలు మోము త్రిప్పలుచు బైఁ దిమిరించుట లోరచూపులున్
మాటలు ముద్దు జంకెనలు మవ్వపునవ్వులు గోఁటిచిమ్ములున్
నీటుదొలంకుచిన్నెలును నెవ్వగసన్నలు లేని యూరుపుల్
మేటిగసల్పువింత పగమిండలఁగాంచి పధూటి మాటికిన్. 76

సీ. పూటపూట మెఱుంగునీటు గాఁబెట్టుచుఁ, గమ్మలు క్రొమ్మించు కాంతులీన
మాటిమాటికిమానె పాటు గాఁబదనిచ్చి, తలదువ్వికొప్పిడు వలపుఁగులుకఁ
గడెగడెకును బెట్టె నిడియున్న గడితంపుఁ, జలువలుగట్టును జెలువు దనర
దినదినంబును వింతదేఱఁ జొక్కటపుసొ, మ్ములుదాల్చు నెమ్మేనఁ దళుకులొలుక

తే. గళమునను బూయు గందంబు గందవడియుఁ
గ్రొమ్ముడిని జెక్కు సవరంబుఁ గ్రొవ్విరులును
సొగను దనరార విటకోటి సొక్కి తిరుగఁ
జిత్తజాయత్తచిత్తయై చిగురుబోఁడి. 77

తే. మదనపీడితయై యన్యమానవాభి, లాష మెదఁబూని యిటుల నలంకరించి
తిరుగుచుండెడుపిననాఁడె వెరవుపఱుచు, కొనియెఁ దమిదీఱ నమ్ముద్దుగుమ్మ విటుల.

క. కరణమును నూరిరెడ్డిని, గరిమందగుపారుపత్తెగానిఁ దలారిన్
దత్తిరైయినవేళ నినలు, గురితోఁ బాలివోనిరతులఁగూడి సుఖించున్. 79

సీ. పురిబాహ్యసంకేతపరిగృహంబునకేగి, యామికాభిప్రాయమరలఁ దీర్చుఁ
దత్తిరైయినయెడఁ జేని దగ్గఱకేపోయి, ప్రియముగొల్పఁగ రెడ్డి ప్రేమఁ దీర్చు
సంచారికాలయుస్థలికిఁ బిల్పించుక, యధికారికోరిక లమరఁ దీర్చుఁ
వెనయవేళైయున్నఁ దనయింటికేపిల్చి, గరిమతోఁ గరణంబు కాంక్ష దీర్చుఁ



తే. బగలు రాతురులను నెడఁ బాయకుండు, మోహపరితాపవేదన ల్మదిరిచెదరి
చెదరఁ జేయంగ వేఱొకచింత లేక, చండమదమత్తభద్రవేదండగమన. 80

తే. సొగసిసొగయించు నెఱయోరచూపుచూచి
పలికిపలికించుఁ జిన్నెలు బయల నెరపి
భ్రమసి భ్రమయించుఁ దనకు లోఁబడఁగఁ జేసి
వలచి వలపించు నదియెంతవానినైన. 81

క. ఈస్థితిని గొంతకాలం, బాస్థన్విటకోటిఁ గూడియలరుచు మోహా
వస్థలఁ జరుపఁగఁ బతిరాక, ప్రస్థానము సంభవించెఁ బ్రమదం బెసఁగన్. 82

చ. పరపురభూమిభర్త కులభామిని కుగ్రములైనభూతము
ల్తిరముగఁ బట్టిబాధలిడు తెంపుననుండఁగ నానిమిత్తము
న్నరపతి పిల్వనంప గమనంబగు వేడుక రౌద్రకర్ముఁడా
తఱి నెఱమాంత్రికుండగుటఁ దద్దయు నేగెఁ జికిత్స సేయఁగన్. 83

తే. అటుల నిజనాయకుం డేగి యన్యరాజ, పురవరముఁ జేర నంతటఁ బొలఁతి యలరి
తొడుసు మానెఁగ దాయంచు దుడుకుచేసి, విటుల నలరించె నిచ్ఛానువృత్తి మీఱి.

క. ఆజ్ఞయొకింతయు లేమి మ, నోజ్ఞవయోవిటవులకు మనోభవసమర
ప్రజ్ఞలఁ జూపుచు రతిపై, నుజ్ఞానము వొడమి పడఁతి సొంపున నుండెన్. 85

క. ఈతీరు కొన్నిదినములు, చేతోజాతాహవములచేఁ దనరారన్
శీతాంశువదన మెలఁగఁగ, నాతలపరి యొక్కనాఁటి యామిని వేడ్కన్. 86

ఉ. పువ్వులతోడి కోరసిగఁ బొందుగఁ జందురుకావి జాళువా
మవ్వపుటంచు పద్మపురుమాలు సుగంధపుఁబూఁత నేఁతచే
రవ్వగుచల్వ దుప్పటి కరంబున నాకులఁ జంక పట్రముల్
నివ్వటిలంగ దానికడ నిద్దురఁ జెందఁ బిరానవచ్చినన్. 87

క. చూచి ముదమంది దిగ్గున, లేచినదై యెదురుగా నిలిచియును నొక్కకేల్
డాచికొని పట్టి మెల్లనె, యాచెలి తన కేళిగృహము నతనిం జేర్చెన్. 88

ఉ. చేర్చి సరాళముల్గలుగు చిల్కలకోళ్ళఁ దనర్చు పట్టెచేఁ
దీర్చిన తూఁగుపాన్పునఁ గదించినకమ్మనిపువ్వు సెజ్జకుం
దార్చి వినోదముల్సలిపి దర్పకదర్పరణప్రవీణయై
పేర్చుచునుండఁగా రతికిఁ బేర్కొని రెడ్డి ప్రియంబు సంధిలన్. 89

సీ. కమ్మపచ్చడమును గంటీలపోఁగులు, మొలఁజీటికమ్ములముదుగువల్లె
నిండుచల్వరుమాలు రెండొంకుటుంగరం, బులఁ జక్క బొట్టుసొంపులయు పిడను

గందంపునుబూఁత కర్ణయుగంబున, నేర్పుగాఁ జెక్కు గన్నేరుపూలు
కత్తెరగండంబు గజ్జెలు నందెలు, నాదించు జిగిసకలాదితిత్తి
తే. పాదములఁ గిఱ్ఱుకిఱ్ఱని పలుకుమెట్లుఁ, గుచ్చుటద్దాలఁ జేపట్టు కోలయమర
రెడ్డి ప్రియురాలివాకిటఁ బ్రేమనిలిచి, వాకిలిసడల్పుమనుచుఁ బిల్వంగనపుడు. 90
క. తలవరి గడగడవడఁకినఁ, గలఁగకుమని వీఁపుఁ జఱచి ఘనురాలతనిన్
నిలిపె నొకమూల నటుక, న్నెలమిని వాకిలి సడల్చి హితమలరారన్. 91
తే. రెడ్డి నింట్లోకిఁ బిలిచిని రెయహాత్తి, వాకిలిగదించియపుడుఁదా వానికేలు
పట్టుకొనివచ్చిశయ్యపైఁ బవ్వళించి, ననవిలుతు కేళినిద్దఱు పెనఁగుచుండ. 92
చ. తెలితలపాగ చొక్కమొలతిత్తి భుజంబునఁ జల్వపచ్చడం
బలచిటిప్రేలముద్రిక యొయారముమీఱఁ బొగాకుచుట్ట సొం
పలరెడు కావిదోవతి పదాబ్జయుగంబున ముచ్చెలొప్పగా
నలవిభుఁడంతగ్రామ కరణం బటకైచనుదెంచి వేడుకన్. 93
క. పెనుతలుపుగడియఁదీయని, ఘనురాలి నతండుపిల్వఁ గాఁపుకొడుకు తా
వినిదిగులొందిన వెఱపకు, మని రెండవమూల నటుక నాతనినుంచెన్. 94
తే. ఉంచికదలకుమిచ్చోట నురగ మొక్కటి, కలదటంచును జెప్పియా కాంత వేగ
కరణమును డాయఁగాఁబోయి గడియఁదీసి, లోపలికిఁబిల్చిమరలఁ దల్పునుగదించి.
మ. దయ కద్దా యని పల్కరించి తమిఁ జెందంజేసి లేనవ్వులం
బ్రియమొందించి కదించి ముద్దులిడుచుం బృథ్వీధరోరుస్తన
ద్వయిబల్ ఱొమ్మునఁ గ్రుమ్మి క్రుమ్మి యనుమోదంబొప్పఁగావించి యా
వియదాకారసుమధ్య సంగమసుఖోద్వేలస్పృహాధీనయై. 96
క. తనివారక పరికట్టక, యనివారకమోహదోహళామోదము పై
చ్చనువారట్లనోన్యము, చనువారఁగళాదులరసి సమరతిఁ బెనఁగన్ 97
వ. ఆసమయంబున. 98
క. నిలువంగి యోరమెలికల, తలపాగ ఖలీతిశాలు తావిమెయింబూఁ
తలు పోఁగులంఘ్రిరక్షలు, వెలయఁగ వేపారిమీఁటి వెలఁదుకకడకున్ 99
మ. వగకాఁడై చనుదెంచి శివిని బహిర్ద్వారంబునన్ నిల్చి తే
ల్పుగ డెందీయుమటంచు నా ప్రవిమలాంభోజేక్షణం బిల్వఁగా
దిగులుంబొందె నియోగి యెట్టులనుచున్ దేహంబు కంపింప నా
చిగురుంబోడి యమాత్యువీఁ గడఁచి తాఁ జెన్నొందఁ శీఘ్రంబునన్. 100
క. మూఁడవమూలను నట్టుక, పైడించి నియోగి నయ్యబల యధికారిం
గూడఁ జని తలుపుసడలిచి, వేడుకఁ గ్రీడాలయంబు వేగ మెచేర్చెన్ 101



తే. చేర్చి వాకిలిగదియించి చెలిమి మించి, కాంక్షలూరించి చిన్నెల కలిమిఁగాంచి
మొలకనవ్వులఁ దేలించి మోహ ముంచి, కళలఁ గరగించి సంధించి కౌఁగిలించి. 102
చ. నుడుకొనిమూఁడుమూలలను ముప్పురుగ్రుక్కిలు ్రంగఁ జెంగలిం
చిన తమిచేత హెచ్చి మరుచెట్టు తెఱంగున డొంకిడొంకి పా
ర్లినగతిఁ బొర్లుకాడి చనులీలలనిద్దఱు నేకకాంక్షతో
ననవిలుకానిపోరునఁ బెనంగెడువేళ నిజేశ్వరుండొగిన్. 103
తే. పరధరాధిపుభార్యకుఁ బట్టినట్టి, భూతములవెళ్లఁగొట్ట భూభుజుఁడు మెచ్చి
దనపరిష్కారసత్రము ల్దనకొసంగి, యంపకము సేయఁ దనయింటి కరుగుదెంచి.
క. తలుపుసడలింపు మనుచుం, గులభామనుమాంత్రికుండు కూపెట్టినచోఁ
దలఁకెడివ్యాపారి మన, శ్చలనము పోవీఁపుఁ జఱచి సంభ్రమమొదవన్. 105
ఉ. నాలవమూలయందు నుపనాథునినుంచి కృశాంగవల్లియై
యీలువు భక్తియుక్తిఁ దమిహెచ్చు భయంబునఁ దల్పుదీసి యా
నీలశిరోజ నేత్రముల నీళ్లు నెకౌళులుఁగ్రడ్డి కౌఁగిటం
దేలిచి యింటిలోపలికిఁ దిన్నఁగఁ దోడ్కొనివచ్చె మెచ్చుచున్. 106
తే. పరధరాధిపుభార్యకుఁ బట్టినట్టి, భూతముల వెళ్లఁగొట్టిన భూభుజుండు
దనరఁగా నీకొసంగిన ద్రవ్యమేది, కనుఁగొనెదఁ జూపుమన రౌద్రకర్ముఁడపుడు. 107
చ. తెమలని చిమ్మచీఁకటిని దీపములేమిని జూపుటెట్లు దీ
పముగొనితెమ్ము చూపెదను భద్రముగానివి నీవె దాఁచిపె
ట్టుము మునుదాఁచుమూలనె కఠోరకుచాయని పల్కరింపఁగా
నమితభయార్తచిత్తులయి యయ్యధికారిముఖుల్ చలింపుచున్. 108
క. మునుదాఁచు మూలదాఁచు మ, టనిభార్యను బొడిచియాడె నదిదీపము చూ
పినఁ జూచి వీఁడు మస్మే, మనునోయనుశంక చేత మదిఁ దహపడుచున్. 109
చ. నలువురుగుప్పుగుప్పునను నాలుగుమూలలనుండి దూకి వి
చ్చలవిడిఁ బాఱసాగినను సాహసమొప్పఁగఁ దద్విభుండు గొం
దలపడి చూచి వీరెవరు దాపక చెప్పుము చెప్పకున్న న
గ్గలమున నివ్వధింతు నని కత్తిని దానొఱదూసి పల్కినన్. 110
క. ఆవేళ నెట్లు బొంకం, గావలయునొ కొమ్మ తేటగాఁ జెప్పి ధరి
త్రీవిభుని నెనయఁ జనుమనఁ, గా వినియోజించి వనిత కళవళపడుచున్. 111
ఉ. వింతకథాగహాస్యములు వీనులవిందుగ వింటిఁ బార్వతీ
కాంతునకైన శక్యమిది గాదు వచింపను బ్రష్టలోకప

ర్యంతము చూడఁదోఁప దిది హంసవతంసమ నీవె చెప్పి భూ
కాంతునిఁ జేర నన్ననుపు గాథలచేతనె ప్రొద్దుపుచ్చఁగన్. 112

క. అనవిని మేల్మేలజాణవు, గనఁజెప్పఁగరాదె యెంత కథయిది నే నీ
కును దెలియకున్నఁ జెప్పెద, వినవే ఘనురాలిబోంట విశదముగాఁగన్. 113

చ. వినుమునిజేశ నీవు చని వేఁటలొకయూరికిఁబోవ నాఁటిరా
త్రి నిన్నొకతెం బరుండఁ గను దృష్టికిఁ గన్పడెఁ గొన్నిరూపముల్
కనుపడి మమ్ము నీమగఁడు కాలిడనీయఁడు మాస్థలంబులం
దునిపెడ మేము నిన్ననుచుఁ దూటిన నందొక భూతమయ్యెడన్. 114

తే. నాతి యీవేళ నిను గాచినాము నిన్ను, నీదు మగఁడింటికరుదెంచి నిలిచినపుడు
మాతెరువు దానురాకుండ మనివిచెప్పు, చెప్పకుండిన నీచావు సిద్ధమనుచు. 115

క. బెదరించినాఁటిరాత్రికిఁ, గదలెఁ భూతమ్ములంతఁ గనుమూర్కొఁడు వే
ళ దినము దినమును పడినా, యెదుటంబొడకట్టి నాపయింబడి యల్కన్.

క. పదియైదునాళ్లు భూతము, లదయత ననుఁజూచి నీనిజాధిపుఁడు మముఁ
బెదలంగనీయఁ డియ్యెడ, విదళింతుము నిన్నుఁబట్టి వెలఁదీ యనుచున్. 117

క. ఇంతకుమును దనుకను న, న్నెంతయు బాధించె నింటికీవిప్పుడు రాఁ
బంతము చెడి నీభయమునఁ, గాంతుఁడ యవి పాఱిపోయెఁ గడుపడిఁగంటే. 118

క. ఈరీతి నీభయంబునఁ, బారెడు భూతములఁజూచి భామా వారె
వ్వారని సంశయమున ననుఁ, గారింపఁదలంచి తహహ కరుణయు లేకన్. 119

క. నీవింట లేనితఱి భూ, తావళిచే నొచ్చుకంటె నదయుఁడ నీచేఁ
జావగుట లెస్స తనకటుఁ, గావుననిదె నఱుకుమనుచుఁ గంఠము వంచెన్. 120

ఉ. వంచిన భామినీమణి నవార్యకృపం గని తద్విభుండు హ
స్తాంచిత మండలాగ్రము రయంబున నవ్వలఁ బాఱవైచి రా
జించిన వేడ్కఁ గౌఁగిట నునిల్పి నెఱుల్ కొనగోళ్లఁ దీటిలో
నుంచకు భీతియంచు వినయోన్నతి నూఱటఁ బుచ్చి యంతటన్. 121

తే. భూతకాఁపును బెట్టి విభూతిబెట్టి
యంత్రములుగట్టి వెఱవకు మనుచుఁ దట్టి
పోయెలెమ్మన్న స్నానాన్నభుక్తిరతుల
మగనిఁ గఱఁగించి ఘనురాలు మమత నుండె. 122

క. అనియంచ పలుకు నత్తఱి, నినుఁ డుదయాద్రిని వసింప నింటికిఁజని యా
దిన మెల్లఁ గడపి యామిని చనుదెంచిన నృపతి నెనయ సంతోషమునన్. 123

ఉ. కొప్పున జాజిపూలు మణికుండలముల్ చెవులందుఁ గంధరన్
గొప్పను పాణిపేరుఁ జనుగుబ్బలఁ గుంకుమపూఁత పుక్కిటన్



గప్పురపుంబవిడెంబుఁ గనకంపు కడెంబులు చేతులం గటిం
జొప్పడు చల్వదువ్వలువ సొంపుఘటింప లతాంగి వచ్చినన్. 124

క. కనుఁగొని హంసము తరుణీ, విను మొండొక పిన్నకథ వివేకముతోనే
వినియెద నని నీవడిగిన, వినుపించెద ననిన విరహవిహ్వలబుద్ధిన్. 125

క. దినములు నీ గాథలచేఁ, జనెఁగాని నృపాలుఁజేర సాగకపోయెం
జనియెద నేఁడైనను నా, మనవిని విని వేగ తెల్పుమా పతగమణీ. 126

---

## పదునొకండవ రాత్రికథ.

క. అని పలికిన హేమావతిఁ, గని పల్కెఁ బతంగవిభుఁడు కనకంబను పే
రునఁ దగు పురినొక విప్రుం, డనవద్యుఁడు చంద్రశర్మ యనఁ దనరారున్. 127

వ. అతఁ డక్షర లక్షణ ఋగ్యజుస్సామాథర్వణంబులు వేదాంత వైశేషిక భాట్టప్రభా
కరపూర్వోత్తర మీమాంసశాస్త్రంబులును, బ్రహ్మాండ విష్ణు నారద మార్కండేయ
వామనాగ్నేయ గారుడ భవిష్యద్భాగవత స్కాంద మాత్స్య లైంగ కూర్మ
వాయు వరాహ పద్మ బ్రహ్మవైవర్త బ్రహ్మోత్తరఖండంబు లనుపదునెనిమిది పురాణం
బులును ఆదిసభారణ్యోద్యోగ విరాట భీష్మ ద్రోణ కర్ణ శల్య సౌప్తిక స్త్రీశాంత్యను
త్యనుశాసనికాశ్రమవాసాశ్వమేధ మౌసలమహాప్రస్థానిక స్వర్గారోహణంబులను
పదునెనిమిది పర్వంబులును, శిక్షా కల్ప జ్యోతిర్వ్యాకరణ నిరుక్తములును, ఉక్తా
త్యుక్త మధ్య ప్రతిష్ఠ సుప్రతిష్ఠ గాయత్రి ఉష్ణిక్ అనుష్టుప్ బృహతీపఙ్క్తి
త్రిష్టుప్ జగతీ అతిజగతి శక్వరి అతిశక్వరి అష్టి అత్యష్టి ధృతి అతిధృతి కృతి
ప్రకృతి ఆకృతి వికృతి సుకృతి అభికృతి ఉత్కృతియను నిరువదాఱు ఛందస్సు
లును, బైలజ రోమజ వాసిష్ఠ సోమసూర్యాది సిద్ధాంతంబులును, ఉపమా రూప
కదీపకావృత్త్యాక్షేపార్థాంతరన్యాస వ్యతిరేక సమాసోక్త్యతిశయోక్త్యుత్ప్రేక్షా
హేతుసూక్ష్మ లేశ క్రమ సర్వప్రియోర్జస్వపర్యాయోక్తిసమాహితోదాత్తాపహ్ను
వశ్లేషోక్తి తుల్యయోగితా ప్రస్తుతప్రశంసా వ్యాజస్తుతి నిదర్శనాసహోక్తి పరి
వృత్తి సంకీర్ణవిభావనాద్యలంకారంబులును, అమరామరశేష విశ్వశాశ్వత శబ్దార్ణవ
యాదవ వైజయంతీ నానార్థ రత్నమాలికాకార హలాయుధ వాగురికేశవ తార
పాల ధన్వంతరీ ధరణీ ధనంజయ రభస విశ్వప్రకాశ మాధవ చింతామణి జయ
ప్రతాప శుభాంగజయపాల క్షీరస్వామ్యేకాక్షరాది నిఘంటులును, సంస్కృత
ప్రాకృత శౌరసేని మాగధి పైశాచి చూళికోక్త్యపభ్రంశాంధ్రములను నష్టభాష
లును స్వరనిత్యసమానప్లుతకాక్వాదేశ ప్రాదిప్రాది యోగవృద్ధ్యభేద దేశీయోభయశ

కంధ్వాఖండవిభాగ వికల్ప ప్రభునామ భిన్నవర్గ సంయుక్త వికల్ప సంయుక్తము
లను జక్కటియెక్కటిపోలికలును సరసానుస్వార బుజూవు లనంబరఁగు యతుల
విధంబులును సమనామసంయుక్త సంధిగతోభయ ప్రాది వికల్ప బింద్వగ్రబిందు
బుప్రాస త్రికారసములఘుప్రాస మైత్ర్యంత్య దుష్కరద్వంద్వ త్రిప్రాస చతుర్థ
ప్రాసా ద్యష్టాదశ ప్రాసంబులును, షగణ యగణ రగణ సగణ తగణ జగణ భగణ
నగణంబులును, జంద్రేంద్ర సూర్యగణంబు లను నుపగణంబులును బ్రయోగించి
తత్తద్దేవతాలక్షణంబు లెఱింగి కదళ్యాద్ద్రాక్షా నారికేళపాకంబుల కవిత్వరచన
లెఱింగి సకల విద్యాపారంగతుండై యుండె నప్పుడు. 128

తే. అతఁడు తనసతు లిద్దఱు నహరహంబు, వాదొనర్చుట సైఁపక వలపుఁగులుకు
పిన్న పెండ్లాముపక్షమై పెద్దభార్య, భాషిణీనామఁ గడనుంచె దోష మనక. 129

సీ. నెఱిగొప్పు నెఱరంగు నీలంపుసద్రుచుల్, నారదభావంబు జూఱఁగొనఁగఁ
గలికి కాటుకకంటి చెలువుభారద్వాజు, గరిమంబునైనఁ జీకాకుపఱుప
మించు సిబ్బెపుగుబ్బ మినుకులు కుంభజ, సద్వృత్తమంతయు జడియఁజేయ
మందయానపుఁ బ్రౌఢిమము మతంగజధైర్య, పర్యాయ మెంతయుఁ బగులఁ జేయ

తే. నవసుధామయ మధురోక్తి నైపుణములు, శుకమనోవృత్తి నెంతయుఁ జులుకఁ జేయ
మెఱుఁగు జిగినిచ్చునగజక్కనెఱతనంబు, వెలయఁజరియించునది మునవ్వీటిలోన.

తే. మగఁడు పెఱవాడవైచిన మట్టుమీఱి, బిడ్డపాపలఁ గనియెత్తి పెంచుజోలి
లేదుగావునఁ దిండిచే నూఁది పోఁత, బొమ్మగతి నుండు నక్కొమ్మ యెమ్మెచిమ్మ.

చ. కుడువ సమస్తభాగ్యములు కోరికమీఱఁగఁ గట్టవస్త్రముల్
దొడుగ విశేషభూషణములుం దనరార నలంద గంధమున్
ముడువను మంచిపుష్పములు మొత్తముగల్గిన భోగహీనలై
పడఁతుక లుండనేర్తు రటె ప్రాయమునం బెఱతో వడాయకన్! 132

తే. పిఱుఁదుఁ బిక్కలుఁ జెక్కులు బెడఁగుఁదొడలు
వెడఁద యొడలును జన్నులు వెంద్రుకిడను
నందులేకుండ బలియుట సకియమనసు
జారసంభోగకేళికి స్వారివెడలె. 133

వ. అది మఱియును. 134

క. జారుల మదిజారఁగ నా, నారీమణి మోవి లేఁత నవ్వెసగించున్
హారంబుల వారంబుల, హీరంబులనన్ రదాళి యించుక మెఱయన్ 135

తే. మనసు నిలుపక తమిహెచ్చి మాఱుమగల, వెదకుచుండంగ నప్పుడా వీథివెంట
వింతపరదేశి చతురాఖ్య విప్రుఁడొకఁడు,వచ్చె భాషిణి కనువిచ్చి మెచ్చి చూడ. 136



ఆ. విప్రుఁ డివ్విధమున వీథి సేతెంచుచు, సొలసి కొలను లరసి మూచికొనుచుఁ
దన్నుఁ జూచుచున్నధరణీసురాగ్రణి, గరుణిగాంచి దాని దఱియవచ్చె. 137

తే. నచ్చి ధర్మాభివృద్ధిఁ గావలె నటంచుఁ, బరమభాగీరథివి మహాభాగ్యశాలి
ననుచు దీవించి నా కింత యన్న మనుచు, వేఁడ భాషిణి యావిప్రవిభున కనియె.

క. పేరెయ్యది యూ రెయ్యది, మీ రెయ్యెడ కేగఁదలఁచి మెట్టితి రిటకం
చారసి యడిగిన బాడబ, సారసలోచనకు వేడ్కఁ జతురుం డనియెన్. 138

చ. మునుపు ప్రసిద్ధిమీఱఁ దమమూఁడవతాతతరాన నుండియుం
డిన యది కాణయాచిగను డెంకణధారణియందుఁ దండ్రి నన్
గని చదివించు బుద్ధి నయగారికి నప్పనసేయ నక్షరా
భ్యనిగ నొనర్తునంచు బడి కొయ్యనఁ దోడ్కొనిపోయి యచ్చటన్. 140

సీ. నన్నయ్య వార లోనామాలు దిద్దుకో, మ్మనినచోఁ గడుప్రనొప్పనుచు నేడ్చి
దండమ్మునను గుణింతము పెట్ట రమ్మన్న, నంగుళి వ్రణమాయె ననుచు జుణిగి
శిష్యులచేఁ గాలు సేతులు గట్టించి, తెచ్చి పద్యముఁ జెప్పఁ దెమలకుండి
పలక వ్రాయుమటంచు బడి కెత్తుకొనిపోవ, బలపంబు లేదని పలుకకుండి

తే. యలుక చే నుండ బుగ్గలు నులిమి తిట్టి, తొడలు వడిపెట్టి కోదండ మడరఁగట్టి
రెట్ట లెగఁబెట్టఁ బట్టించు తీపు మాపుఁ, గొట్టుబెట్టుగ సజ్జనకోలదెగను. 141

సీ. గద్దించి వడిదిట్టి దిద్దమంచును వ్రేలు, వెట్టింప నచటనేఁ బెట్టకుందుఁ
బలుమాఱు లో యని పల్కుమంచును గొట్టి, చెప్పినశిలవృత్తి దప్పకుందు
నొకటికి సెలవియ్యనుతికి చీఁకటిదాక, బనులగాపరుల వెంబడిన పోదు
జననియడుక్కొని చదువుకోఁ బొమ్మన్న, వినక వేమఱువెక్కి వెక్కి యేడ్తు

తే. సారె పద్యపుఁబలుకపైఁ జమురుపూఁతు
నెప్పుడును బెద్దపలక పాక్కఁత్తఁజేతు
బాలరామాయణము పుస్తకాలు దాతు
వేయుసజ్జనకోలలు విఱిచివైతు. 142

క. చరికుండ పగులఁగొట్టుదుఁ బరువడి సూత్రంబు ద్రెంచి పాఱఁగవైతున్
మరిమరి బలపము లిచ్చినఁ, బొరిదినమును బగులఁగొట్టి పోయె నటంచున్. 143

తే. నన్ను బింగీలు పెట్టించునాఁడె యయ్య, వారు నిద్రింపఁగాఁ జూచి చేరి యచటఁ
జింతవ్రేల్కొమ్మ వంచుక సిగనుగట్టి, విడిచి యుఱికితి నయగారు మిడికివూయ. 144

తే. అంతఁ దలిదండ్రు లయగార లదిమొదలుగ, వేఁడిపెసలట్లు వేసరి విడువ నేను
గొంటెనగ నారతాయిలఁ గూడుక పలు, గాకిచేష్టల నాటలఁ గ్రందుకొంటి.

వ. అంత మఱియును. 145

సీసమాలిక. దూచియు జాబిల్లి బూచి కన్నులకచ్చి, గుడిగుడిగుంజాలు కుందెనగిరి
చీఁకటిమొటికాయ చింతాకుచుణుకులు, పులియాటలునుఁ జిట్లపొట్లకాయ
తూరనకుక్కలు తూనిగతానిగ, చిడుగుడు మొకమాట చిల్లకట్టె
దాఁగిలిమూఁతలు తేనుబిల్లయాలాకి, గుబ్బట గురిగింజ కొండకోఁతి
చిక్కణబిల్లయు జెల్లెను ఁడుగుడు, బిల్లబిద్యను లక్కిబిక్కిడండ
గడ్డెనభోడి యొక్కసికొక్క బరిగాయ, పోటు గీరనగింజ బొంగరములు
పెంచులబేరివోపిల్లిగాలిపటంబు, సరిజేసి పుటచెండు చాకిమూట
గోట దొర్లుడుకాయ గొబ్బిళ్లమోపిళ్లు, నీగపోగిసబంతి దూగిలాట
వెన్నెలకుప్పలు ప్రేఁబుబొట్టగ గిరి, సెంగన్నసత్తియుఁ జిందుపఱుపు
గచ్చకాయలు కిఱ్ఱు గానుగత్రిప్పుళ్లు, గుజ్జుపెక్కుడు మంటు గూళ్లసూళ్లు
కాలికంచంబును గట్టెగుజ్జువినా, యకుతిరితూనె కోట్లాటచెమట
కాయత్తుగొడుగు బొంగరముదామన్నాట, పొడుగుళ్లనుయ్యాల బోర్లపక్క
బండ్లికలును జోప్ప బెండ్లమంచంబులు, గంగెద్దులాటలు గనికెకుండ
వీనెగాజులుపోతుటీనెగుజ్జంబులు, నాల్గుకంబాలాటనట్టకోఁతి
దంటికిన్న రమంటిగంటిపోట్లాటలు, సింగన్నదాటులు జిరుకురాతి
దాబాటలను మంచితాటాకు చక్రచ, క్రౌలత్రిప్పుడుతోఁచి గాయపడుపు
పాడుపాతేరమాళ్లు పాతరల్ బంతులు, చిమ్మనగ్రోవులు చిఱ్ఱుబుఱ్ఱు
లాకుపీకలు జంద్రలాటలు చంద్రాళ్లు, గిలకలు చిటికెలు కీచుబురలు
కోలాటములు పిల్లఁ గ్రోవులు గుమ్మడి, క్రోవికూఁతలు నూఁదుకొమ్ముపులొడ్డు
విడుపునెట్టునుగాయ విండ్లమ్ములాటలు, పులిజూదములుకట్టెపుట్టచెండ్లు
దాయాలు సోగటాలు దాట్రాయ చదరంగ, మునుజోటురాళ్లను మూఁతపాడుపు
వామనగుంటలు వడిగుప్పిగంతులు, చెఱకులపందెముల్ చిమ్ముడాయి
తుమ్మెదరేఁపుళ్లు కుమ్మరసారెలు, బందారుబసవన్న పత్తికాయ
తిరుగుడుబిళ్లల త్రిప్పుళ్లు జరుగుళ్లు, చిటితాళవిూళలు నెటికెతట్లు
తే. తాటియాకులచిలుకలు తాళ్లపాము, లకటయగచాట్ల ప్రాఁతనై యాడుకొనుచుఁ
జదువుపై సంధ్యపై నాస్థ చాలలేక, పొలతి యీరీతి నేఁబ్రొద్దు పుచ్చుచుండ.
క. విను మాట్లాడఁగఁ బెద్దలు, ననుఁగని పనిసేయుమనుచు నాటినకోపం
బున నేవలాడ వినలే, కనుదేశభ్రమణవృత్తిఁ గైకొని మతిముఖ్. 147
క. సత్రాశన పాత్రుఁడనై, విత్రాసము మాని వింత విషయయలపడిన్
యాత్రావస్థలఁ దిరిగితి, రాత్రి పవళ్లనక వినుము రాకేందుముఖీ. 148
వ. ఇంత యేమిటికంటేని. 149



సీ. తల్లికిఁ గలనైన దయలేదు నామీఁదఁ, దండ్రి యెప్పుడు చూచి వేండ్రపడును
బినతండ్రి బెదరించుఁ బెదతండ్రి కోరించుఁ, బెదతల్లి యూరక బెట్టుఁదిట్టుఁ
బినతల్లి మెటికెలు పెళ్లనవిఱుచును, నన్నదమ్ములు చూడ రతులకరుణ
పదినెలు మఱఁదండ్రు పదరుచు శాపింతు, రక్కలుఁ జెల్లెండ్రు లెక్కఁగొనరు
తే. మేనమామలు బావలు గానివానిఁ గాఁగఁ జూతురు మావాడ కట్టువారు
కంటగింతురు నన్నంటెఁ గములజాతు, వాఁతఫలమేమియో కాని వనజగంధి.
తే. ఇంక నెన్నైనఁగలవు నాహీనదశలు
నాపదలుఁ జెప్ప నేఁటికిమీఁ దాఱునెలలు
పట్టునది యేటిజోలి నాపాపఫలము
నేఁటితోఁ దీఱె నోకొమ్మ నిన్నుఁ జూడ. 151
క. అని చతురాఖ్యుఁడు వేగమె, తనవృత్తాంతంబుఁ జెప్పి తరలాక్షి క్షుధా
ర్తిని డస్సితి భోజనమిడు, మని భాషిణినడుగఁ గానె యది యిట్లనియెన్. 152
క. ఈవేళమాత్ర మన్నము, గావించెదఁగాని మాపు కదలక దినముల్
నీవు పరుండెదవా సుఖ, జీవితముగ నిచట నొకటి చెప్పెద నీకున్. 153
తే. అనినఁ జతురాఖ్యుఁ డామాట కాశఁ బొంది
నీవు చెప్పినమర్యాద నిజము నేను
జేయఁగలవాఁడ నని బాసఁ జేసి యపుడు
భోజనమొనర్చి వెలువడి పోయి యతఁడు. 154
సీ. అప్పుడె యేమని యడుగనైతి నటంచుఁ, బలుమాఱుఁ దలఁచి యార్పులఁ నిగుడ్చు
నీసారిచని వేఁడ నేమనునోయని, సంకోచమునఁగొక్కి చక్కఁబోవు
నస్తమానముగా దటంచుఁ బాదచ్ఛాయ, లొనరించు ప్రేళ్లెంచికొనుచునుండు
నీయూర గడియార మేడ లేదాయని, వీథివెంబడిఁ బోయి వెదకి చూచు
తే. లీలఁ బవళించు దిగ్గన లేచిపోవు
నిలుచుచోటను నిలుపక నిప్పద్రొక్కు
కోఁతిచందానఁ జతురాఖ్యకుండుదిరుగు
వెలఁదిపై మోహమెద హత్తి వెత్త్రియెత్తి. 155
క. ఇటులఁ దమి హెచ్చి యతఁడు, నటులం బెట్టంగ నొచ్చి సడి నటునిటుఁ జెం
దుటకు వెలిసొచ్చి రతిసం, ఘటనార్థము మిగుల వేగు కాలమునందున్. 156
ఉ. భానుఁడు గ్రుంకఁగాఁ గనియపారముదంబునఁ బొంగి భాషిణీ
మానిని యిల్లుచేరి వగమాటల లేటలఁ బ్రొద్దుపుచ్చి య-

హా నిపుణోక్తులం జెనక నాబిడఁ జూచి టురమ్మటన్నచోఁ
బూనిక నిట్లు! చేకొనెడు బుద్ధిటువచ్చితి నేమి చెప్పరా. 157

తే. మంచి తగినగృహస్థుఁడ వెంచఁబరక, కెత్తుకొమ్మన్నఁ బాతికె కెత్తుకొంటి
ననినఁ జతురుండు నణఁకంగ నప్పళించి, జడియకు మటంచుఁ గౌఁగిటఁజక్కఁజేర్చి.

క. తరితీపు నగలుఁ జిన్నెలు, మురిపెములు వినోదకథలు మోహపుభాషల్
పరిపరివింతలవలపులు, నెఱయంగాఁ జూపి సురత నీరధి ముంచెన్. 159

వ. ఇట్లు చెలంగి. 160

చ. కురు సురతక్రియాం ప్రణయకోపమతం త్యజ పూర్వసంగమం
పరిచిను దేహి గాఢభుజబంధనమంగజశాస్త్రవాసనాం
స్మర దద ఖండనం ఘటయ మామవ మారశరాన్న ఖక్షతం
విరచయ యంచుఁ బల్మఱును వేడ్కఁ బచింతురు జారదంపతుల్. 161

వ. ఇట్లన్యోన్యసరససల్లాపంబుల నెడతెగని మోహాతిరేకంబున సంఫుల్లహల్లకభల్లమల్ల
యుద్ధమహోద్ధతసన్నద్ధబుద్ధిని సరికట్లం బెనంగి యుల్లసిల్లి కరంబులు కరంబుల
నురంబు నురంబున ముఖంబు ముఖంబున నూరువు లూరువులం గీలుకొల్పికొని
నిద్రించు సమయంబున. 162

చ. వనితయు నిద్ర లేచి తెలవారెను లెమ్మని జారులేపి నీ
వనుదిన మిట్లు రాత్రిసమయంబున వచ్చి యనంగసంగరం
బున నను డాయుచుంచు నెరమోహముతో వినుతింప మంచి దం
చును వచియించి వేడ్కఁ బడుచుం జతురాహ్వయుఁడేగె నంతయున్. 163

తే. వీగి సంధ్యాద్యనుష్ఠాన మెలమిఁదీర్చి, పురములో రచ్చరావులఁ బ్రొద్దుపుచ్చి
యస్తమయము సమీపమా నంతనేటి, కేగి మజ్జనమాడి యథేచ్ఛతోడ. 164

క. అక్షసరం బార్ద్రాంశుక, మక్షయ కరపాత్ర మమర నతఁ డప్పురిలో
భిక్షాందేహి యటంచు న, పేక్షం బ్రతిగృహముఁ దిరిగి భిక్షం బెత్తున్. 165

తే. ఎత్తి తెచ్చిన భిక్షాన్న మెల్లఁజల్ల, శాకమిడునింట భుజియించి సకలవైశ్య
జాల యాచితలబ్ధతాంబూలచర్వ, ణోష్ఠశోణిమ మోమున నొఱపు నెఱప. 166

క. మనుజులు నిద్రాళయులై, యొనరినతఱి నాల్గుదిక్కు లొగిఁ జూచుచు వే
చని భాషిణియింటికి ముద, మునఁ జతురుఁడు నిచ్చదాని ముచ్చటఁ దీర్చున్. 167

వ. ఇట్లు ప్రతిదినంబున నతండు భాషిణీయోషాభిప్రాయంబు దీర్చునంత. 168

మ. ఉహుహుహూకారితనూవిధూనన జనవ్యూహోపభూజృంభమా
ణహూఘంతీజ్వలనంబు శీతపవమానస్పర్శరోమోద్గమా



వహానాంగాఖిలజంతుసంఘము హిమవ్రాతాంబుజాతాండ మి
ష్మహిమీఁదం బొడసూపె నెయ్యెడల హేమంతంబు దుర్దాంతమై. 169

సీ. సకలదివావ్యాప్తభక సితీకృతములు, బహుళనిద్రాముద్రపంకజములు
నిబిడవర్షితమహానీహారకణములు, శీతలోత్తరజాతవాతతతులు
వర్ధితనిర్ధూమవహ్నిహసంతులు, కైరవవికసనకారణములుఁ
చాలవృంతవిహారకేళిదారణములు, యామినీసముదయాయామదములు

తే. సరసమృగమద మేచకాగురుసుగంధ, బంధురశ్రీకుచద్వంద్వబాధయుక్తి
చకితపురుషావళీశీతసాధ్వసములు, భాసురము లయ్యె హేమంతవాసరములు 170

ఉ. శాంతములయ్యె నెండలు నిశాంతములయ్యె సధూమకుంచంబుల
త్యంతము వాడి వేఁడిమికిఁ దాంతములయ్యెఁ బయోజము ల్విరిశా
క్రాంతములయ్యె నాతెఱలు కొంతములయ్యె మహోష్ణవస్తులా
శాంతములయ్యెఁ దావులు నిశాంతములన్ హిమవారివారికిన్. 171

తే. అట్టి హేమంతకాలంబునందు నొక్క, నాఁడుచతురుండు భాషిణితోడఁగూడి
రాత్రిఁ బరిపరిరీతుల రసికవృత్తి, సురతకేళుల నైపుణిఁ జూపు నపుడు. 172

చ. నెలవునఁ జందరశ్మి గనిష్ఠకుటుంబిని లేనిపోనివా
దులజగడించు చిత్వైపలఁ దోలిన వ్రాలిన చింతనొంది యూ
ర్పు లెనయ దైవమా యనుచుఁ బొక్కుచు నెవ్వరు బల్కరంచుఁ జే
రెలుఁగున భాషిణీయువతి యింటికి వచ్చె నతండు ఖిన్నుఁడై. 173

తే. వచ్చి యచ్చందరశ్మి తావాకిటికడ, నిలిచి తనయగ్రమహిషినిఁ బిలువఁగానె
గుండె ఝల్లని చతురుండు కొంకుచుండ, నతని నెట్టింటి యిలువెళ్లి ననుపవలయు.

క. ఇది తెలిసిన నృపునెనయుం, బద మని యోయంచు పలుక భామమణి నా
కది తెలియ దెటుల ననిపెను, విదితముగాఁ దెలుపు మనిన విహగం బనియెన్. 175

తే. అటుల నిజపతి తనుఁబిల్వ విటునికేలు, పట్టితోడ్తెచ్చి భాషిణీ పద్మగంధి
తలుపుఁ దెఱచుచు నామూల నిలిపి వాని, నాత్మనాథుని కెదురుగా నరిగియపుడు

ఉ. నెయ్యము మీఱఁగాఁ జరణనీరజము ల్తలసోఁక మ్రొక్కి వే
డ్కయ్యెడఁ బల్లవింప హృదయంబున భాషిణి యాత్మనాయకుఁ
జయ్యనఁ దార్చి దివ్వె లిరుచక్కి వెలుంగ మునుంగు వెట్టి నే
డెయ్యెడకైన నేగవె చెలీ యని పల్కఁ బతుండు దిన్నఁగన్ 177

చ. అనువచనంబు దన్ను నొకయన్యగృహంబున కేగు మంచుఁ బ
ల్కినసడని యారి నెంచి పడి కేహము వెల్వడి యూళిటుండు పో

యునతరువాత భాషిణి నిజేశునిదగ్గఱఁ బండఁ బ్రేపకం
గొనకొనలేనివాఁడు లొనఁగూర్చి చరించెను వేఁగునంతకున్. 178

క. జారులపై నాసక్తులు, నారుల కున్నటుల నాత్మనాయకులపయిం
గోరిక లున్నవె యని ఖగ, మారయ. పచియించుతఱి నిశాంతం బైనన్. 179

మ. కని హేమావతి దాని మెచ్చుచు సమగ్ర స్వర్ణసౌధాంతరం
బున నక్షీణనిజాళువాగొలుసులన్ బొల్పొందు నుయ్యాలపై
ఘనతం జేరి వసుంధరాధిపతి యోగప్రాప్తి ఘస్రాంతమా
దనుకం గుండి తమిస్రమాట కెదమోదం బంది యాపిమ్మటన్. 180

సీ. సకటాక్షదీప్తికాంచనరత్న తాటంక, ధగధగల్చెక్కిట్లు దలఁగఁద్రోయ
సకపోలకాంతి వజ్రమౌక్తిక హారవల్లికా, చకచకల్సాంద్ర చంద్రికలు గాయ
సవలయధ్వని హేమస ప్తకికింకిణీ, ఘుణఘుణల్ శ్రుతి కౌతుకము గమ్రోయ
సస్థానక సుగంధసారసదళదామ, ఘుమఘుమల్ ఘ్రాణోత్సవము గఁ జేయఁ
తే. గళుకు పనిచిల్కుసగలేఁత తళుకు లొలుకు, జాళువాకమ్మి సరిగంచు చలువవలువ
ధళధళల్ జాజిపువ్వుమొత్తములు గురియ, నంచకడఁ జేరె సాతానిమిండబోఁడి.

క. చేరిన హేమావతి ముఖ, మారసి నెఱజాణవౌదు వనుదినము మెయి
న్వేలొక వగ గుల్కఁగ శ్రీం, గారింపఁగ ననుచు ముదము గల్పించి యనెన్. 182

## పండ్రెండవరాత్రికథ.

చ. మనవి పరాకుమాని విను మానిని పూనికమై కళింగభూ
మిని సిరి కాస్పదంబు జనమేజయుఁ డేలు సుగంధబంధురం
బను పుర ముల్లసిల్లు మణిహర్మ్యవినూతనకేతనచ్ఛటా
జనితసువాతధూతసురసాలపతత్సుమధూతవీథియై. 188

శా. అం దుండున్ భసితత్రిపుండ్రమును గామాత్తల్జడల్ కుత్సపా
లం దెల్ దండము కావివస్త్రములు రుద్రాక్షల్ దువాళించు కా
లం దెల్పాదుకలు న్మృగాజినము బెత్తం బొప్ప సంసారియో
గీంద్రుం డొక్కఁడు కూర్మిఁ డీశపదభక్త్యేకాగ్రచిత్తాబ్జుఁడై.

వ. ఆతండు పృథివ్యప్తేజోవాయ్వాకాశంబు లను పంచభూతంబులును, త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణంబు లనుజ్ఞానేన్ద్రియంబులును, వాక్పాణిపాదపాయూపస్థలను కర్మేంద్రియంబులును, శబ్దస్పర్శరూపరస గంధంబులనువిషయేంద్రియంబులును మనోబుద్ధిచిత్తాహంకారంబులను నంతఃకరణచతుష్టయంబును, జీవునితోఁ గూడి పంచవింశతితత్త్వంబులగు నవియె యెఱింగి యమ నియమాసనప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధు లనంబరగు నష్టాంగయోగంబులఁ జతురుండై కమల యోగ బ్రహ్మ గారుడ సుఖ వీర కూర్మ సిద్ధానంత కుక్కుటాసనంబుల నిశ్చలత నిలిచి రేచక పూరక కుంభకంబులను, ప్రాణాపాన వ్యానోదాన సమానంబు లను ప్రధానవాయువులను, నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయంబు లను నుపవాయువులను స్వాధీనత నొందించి యిడాపింగళసుషుమ్నామార్గంబులను, నున్మనిమనోన్మనులను నాదబిందుకళలను, సాంఖ్యతారకామనస్కంబులను, మంత్రహఠ లయ రాజయోగంబులను, మూలాధార స్వాధిష్ఠాన మణిపూరకానాహత విశుద్ధాజ్ఞా సహస్రారంబు లను చక్రంబులను దెలిసి నేర్చి యాత్మాంతరాత్మ పరమాత్మజ్ఞానాత్మ స్వరూపంబు లెఱింగి సత్పురుషుల నాశ్రయించినయుఁ దక్కల లబ్ధిఁ గానక కేవలంబు శైవమతధురంధరుండై యుండె నంతట. 185



క. ఆరాధ్యుఁడు తనునంశా, చారమునకు గురుమహత్వ సత్తముఁడు ప్రియం
బారఁగ నతనికిఁ బెట్టిన, పేరుమ శివదత్తుఁడందు విసువహాగంధీ 186

తే. సంతతమ్మును జంగమార్చనలు సల్పి, భౌమవారంబునను వీరభద్రపళ్లె
రంబునిడి వారిపాదతీర్థమున భుక్త, శేషమునఁ దృప్తిఁ బొందుచుఁ జెలఁగు నతఁడు.

సీ. అయ్యావళీ ముఖ్యమైనరాగము, మిండజంగంబులు మెఱసి నడుమ
గౌరఘుమల్లప్పగంగకు ననుకంచి, కావళ్లవారును గలసి చనఁగ
గుమ్మెత లిక్కన్నర ల్గూడి వాయించుచు, భైరవజోగి వెంబడిని కదల
బసవగంటలు బృహత్పటుశంఖములు మ్రోయ, శివరాత్రి జంగాలు చేరికొలఁద
తే. లశునతిలపిష్టచూర్ణ భాగశనమిసిమి, యుల్లిపచ్చళ్లు పులినోసె లూరుబిండ్లు
మూటజోలలు చిటిగాళ్లుమ్రోనితేగ, నాతఁ డేఁటేట శ్రీశైల మరిగి వచ్చు. 188

తే. వీరశైవంబు ముదిరి యేవేళనైన, హరహర శివా మహాదేవ యనుచుఁ బల్కు
పలుకు నేకాని యితరసంభాషణంబు, లాడఁ డెన్నఁడుఁ బెండ్లామతోడనైన. 189

క. ఆతనికి విశాలయనం, గాఁ దరుణి యొకర్తు దనరుఁ గమ్మవిరిలకో
రీతురక కౌతులాయము, లో తేజీరతన మనుచు లోకులు పొగడన్. 190

క. దానివిలాసపువదనము, దానిచొకాటంపు గబ్బి తళుకులగుబ్బల్
దానిపసమించుదేహము, మానవతీ పొగడ శక్యమా విధికైనన్. 191

సీ. నీలాల రుచినవ్వు నెఱివేణి మొత్తమ్ము, తమ్ములనిరసించఁ దగు మొగంబు
గంబూరభుగభుగల్ గలపించు నునుఁ బల్కు, పల్కుదు రాణులపసను మించు
మించులనిర్జించు మెయితీవపొంకంబు, కంబుసోయగముల గళము మీరు
మీరుగు డారము ల్మానినిగుబ్బలు, బలుదీవి నగు నితంబంబు మహిమ

తే. హిమమయూఖాస్యయూరులయేపు తెగడు
గడును రంభలసొగసు జంఘలుజయించు
నించు విలుకానిశరధుల నేణనయన
యానఘు పదములు కెంజివుళ్లపహసించు. 192

క. చివురా వాతెఱ నల్లని, కవురా నునుసోఁగవెండ్రుకలు పుత్తడిమేల్
సవురా దేహము ముద్దుల, దవురా యని జనులుపొగడ నాబిడ యుసుసన్. 193

తే. దానివెన్నెను మెఱుఁగు దాఁ బూనఁగడఁగి
పుత్తడివెలంది చిదపలై ముద్ర వేసి
యొఱసియొట్టంబు నడికొఁగి నెఱయఁజిమిడి
కఱఁగి నీరయిపోవును గలువకంటి

ఉ. సారసమానవీనఘృణి సంపద కొంచును నెమ్మొగంబు కా
సారసమానవిభ్రమము సారె జయించును నాభియుక్ సుధా
సారసమానమాధురిని జాల రహించును మోవి చంద్రికా
సారసమానహృద్యరుచి సంతతి మించును గాంతహాసముల్. 195

శా. పున్నాగంబును గెల్వఁజాలు రుచిరాంభోజాస్యవేణీరుచు
ల్పున్నాగంబును నవ్వనోపు నెఱయన్ లోలాక్షియానంబులుం
బున్నాగంబును గేరిమీఱి మెఱయుం బూఁబోఁడినూగారు డాల్
బున్నాగంబును మించు నాభిచెలువంబున్ సారె నర్తింపఁగన్. 196

క. అతనుజయధర్మలీలా, హితవృత్తిన్ గన్బొమలు రహించె ననుచుఁదా
నతనుజ యధర్మలీలా, హితవృత్తి రహించి మించు నింతికుచంబుల్. 197

చ. అది పతిభక్తిమీరక దినాంతముదాఁకను సేవఁజేసియుం
పాదవఁగ నారగించి వసనోత్తమభూషణపుష్పగంధసం
పదలను దేలి రేలుప్రియభర్తను సిబ్బెపుగబ్బిగుబ్బలన్
గదియఁగఁ గౌఁగిలింపఁ జనఁగాఁగని కోపవిఘూర్ణితాత్ముఁడై. 198

క. శివదత్తుఁడు హరహరయని, యనలికిఁబో రంకులాడి యని తను ద్రొబ్బం
గనయుసుదిగనుక నాశలఁ, దివురు వ్రతికతివ మోహదీక్ష చెలంగన్.

సీ. పదము లొత్తెదనంచుఁ బదిజంఘికలు దన, తొడలపై వ్రేసికొ మిడిసిపడును
నడుము పట్టెద నంచు నాథునిచిఱుతొడ, ల్పుడికినఁజీయని పొరలునవల
నుపబర్హ మొగఁ ద్రోయ నుకించి మోముపై, మోముఁజేర్చినఁజూచి మునుగులాడు
వ్రేల్లైటికెలుధీయు వెసగొత్తి హస్తంబు, కుచములపై వ్రేసికొనిదట్టు



తే. భక్కలోఁజేరి కౌఁగిటఁ జిక్కఁ బట్టి
కులుకుగుబ్బల నెద యొమ్ము గుమ్మిక్రమ్మి
రతి బలాత్కారమునఁ జేయ ధృతి వహించు
ప్రేయసిని జూచి రోయుచుఁ ద్రోయు నతఁడు. 201

క. ఈలాగు నిచ్చ నిచ్చలు, వాలుగుటెక్కెంబుఁ బూను వానిమరంబుల్
లీల నొనరింపఁ జూచు వి, శాలను చీ రంకులాడి చను మని తిట్టున్. 202

తే. అతఁడుపరసౌఖ్యమునెకోరి యాసఁబొందఁ, డిహమునం దుచ్ఛసౌఖ్యాప్తికింతయైన
జాతి కిడునట్టి గిలిగింత లైతనర్పఁ, గాని ప్రియురాలిచేష్టలు గలప వతని. 203

వ. మఱియును. 204

సీ. ఎడలేక కవ గూడి యేప్రొద్దు రతిసల్ప, వారివైఖరుల కేకారఁ దొడఁగు
సయ్యాటములు గల్గు జంపతీక్రీడకుఁ, గెరలి వేమాఱు గ్రుక్కిళ్ళు మ్రింగు
గందర్పకేళులఁ బొందుసతీపతు, లాసక్తికిని భావమందుఁ గుందు
సురతఖేలనవధూవరుల మైత్రికిమాన, సమున నిట్టూర్పులు సల్పి పొక్కు

తే. విరి లకోరీ దు నేదారి దురముఁగోరి, మీరి పోరాడు సుకుమారమిథునతతుల
వైభవముఁ గాంచి హాయంచు వడిఁ దపించు, సంగమవిహీనయైన యాజలజనయన.

తే. కుసువఁ గట్టను దొడుగను ముసుపఁ బుడన, నెంతగలిగినఁ బ్రాయంపుటింతులకును
గ్రామ్యధర్మంబు లేకున్నఁ గలుగు దుఃఖ, మెంతని వచింపనచ్చునో దంతిగమన.

తే. వినుము నానావిధంబుల దినము దినము
రాత్రి రమణుని గదియఁబో రంకులాడి
పోవె యని త్రోయ గుబ్బలఁ బొఁదు పైఁట
చెరఁగు బఱుచుకఁ బండు నున్సురు మటంచు. 207

ఉ. మిన్నక యిట్లు భర్త తనమీఁద విరాళి వహింపకున్న యా
కన్నియ చూచి యీముదిబికారునితోఁ బని యేమి నా కటం
చున్నిరసించుఁ బంచశరసుందరరూపుల జారవీరులం
గ్రొన్నన వింటివాని మొనకుం గదియించెద నంచు నెంచుచున్. 208

క. వేవిన శివదత్తుకునకును, సేవలు సేయుటలు మాని చిత్తం బలరన్
భావజనిభు లగుజారుల, తోఁగ్రీసలు గనుచుండె విరహదోహాళికాంతన్. 209

చ. చికిలి విభూతిరేఖ జిగిఁజిల్కెడు కమ్మలకాంతిఁజోక హా
టకమణిభూషణంబులమిటారపుఁడెక్కులమూఁక వాసనా
ధికసుమగంధసంపదల తేటగుసిస్తులవీఁక యొప్పఁగా
నకట విశాలనామసఖి హర్షముతోఁ జరియింపు చుండఁగన్. 210

క. అంతట నితాంతహర్ష, స్వాంతయుతద్యూత జనరవక్షుభితవారి
ద్వంతిశ్రుతియై నగర, ప్రాంతంబునఁ గోడి పందెము సాఁగెన్. 211

తే. కావిప్రాఁతలు దారాలు కట్టుముళ్లు, ముష్టులును నీళ్లముంతలు మూలికలును
గత్తులపొదుల్లు మంత్రము ల్కట్టుపసరు, లెనయ వచ్చిరి పందెగాళ్లేపు రేఁగి.

తే. డేగ నెమిలి పింగళి కోడి డేగకాకి, పస్నెలైదింటి కిరులందు పస్నెలందు
రాజ్యభోజనగమననిద్రామరణము, లను విచారించి యుపజాతులను పచించి. 213

సీ. పట్టెజుట్టుని మైలపుట్టమిట్టుది గూబ, బిలుకజుట్టుది మూఁగ బిట్టుకోడి
పట్టుమాప్పది యర జుట్టుది బోరది, బూడిదెపస్నెది పొడది సెల్లు
కాలుది గుజ్జుది గాజులగాడునో, గలది పందెఱ్ఱది గద్దెకోళు
దెఱ్ఱనిదురగలి దీకెలదారెము, నల్లది కొప్పుడి తెల్లయురగ

తే. పిల్లవెళ్లది మొద్దుది నల్లయురగ, లనఁగఁ దగుకత్తికాల్పుంజు లందులోనఁ
బసపుపావళ్లు కాలందె లెసఁగునట్లు, రావిరేకలు బిరుదులు శీవి గలుగు. 214

సీ. గరుడండు శరభంబు కంచుడమారము, రణభేరి కొర్చిచ్చు తాతిబొమ్మ
రాముబాణము మిత్తి రాహుత్తి పిడుగు హ, వ్వీరుండు పుంజుల వేరువిత్తు
గండగత్తెర గుండె గాలంబు మాష్టీఁడు, పట్టభద్రుఁడు బెట్టి భైరవుండు
కత్తులపొది సింహ గాలి బేతాలుండు, పసులపాతర పాదరసము చిలుకు

తే. టమ్ము సుడిగాలి చక్రంబు నలజడదరి
శూలము పిరంగి వెలినక్క సాలువంబు
కాళరాత్ర్యంతకుఁడు పందెగాండ్రు మెచ్చు
లనెడు పేరులపుంజులఁ గొని ముగించి.

చ. చోరఁబడి కొంచి ప్రాఁతలును చుట్టియుఁ గత్తులు వ్రేసి సందిటం
బెరయఁగఁ బట్టి చెక్కుగఱపించి గి రేర్పడ గీది నిల్పి కొ
క్కరయఁగఁ జూచి పందియపు టెంకువ దిద్దుచుఁ జిక్కు వేసి స
ళ్లిరి మరిపో యటంచును ఖిళీపెళిపుంజులు దన్నులాడఁగన్. 216

క. కృకలాసపులం బుట్టిన, కకపికలా దడఁచుచుండఁ గాలజ్ఞరణో
ర్వికడసు నిలిచిన కకనా, మకు నొకనాయకునిఁ జూచి మానిని మెచ్చెన్. 217

ఉ. మెచ్చినయంతలోఁ జిగురుమే లడిదంబు బిగాన దూసి బల్
పచ్చనివింటిబోయ చెలిపైఁ బడి నిబ్బరపుబ్బుసిబ్బెపు
న్మచ్చగలట్టి గుబ్బకవ నాఁటఁ గఁచిక్కునఁ గ్రుమ్మిత్రిమ్మి తా
వచ్చుగఁ జేర్చి యార్చి హరిణాక్షిమనంబు గలంగ నెంతయున్. 218



తే. అపుడు తనుదానె తెలుసుక యబ్జనయన, కులుకు గుబ్బలఁ జిస్నారి క్రొత్తరవికె
పిగలఁ బోకము దూడిపోఁ జేర్మి తోడ, శకునిఁ జూచుచుఁ దనయింటిచక్కి నిలిచి.

చ. అతఁ డొకనీటికాల్వకడ కంతట వే చనితామ్ర చూడ కో
టితయుతహస్తముల్ గడుగు నేర్పున నుండఁగ వానిచెంతకుం
గుతుక మెలర్పఁగాఁ జని శకుం గని కోమలి కొంకుపాటుతోఁ
గొతుకుచుఁ బల్కె నొంటి నిటు గూడునె రాఁదనపంటిదానికిన్. 220

క. అని నీళ్లఁ గాళ్ళ గడుగుచుఁ, జనఁ గావలె నమ్మ చెల్ల సరె తడవాయెం
గన నెవ్వారును లేరని, ఘనకుంతల పల్కుచుండఁ గా శకుఁడంతన్. 221

క. ఇంతీ యెవ్వరు లేరని, గొం తేటికిఁ జేసె దెవరు గొనిపోయెదరే
యెంతపనివచ్చినను నిదె, చెంతనె యున్నాఁడ భీతిఁ జెందకు మనినన్. 222

చ. విని చిఱునవ్వు నవ్వి భువి వింతలు పోమగనాండ్ర నీగతిం
బనుపడి యొంటి నుండఁగని పల్కుట న్యాయమె యంచుఁ బల్కి నీ
వనుదిన మెందు నుందు వెవరైనను వచ్చెద రేల చెప్పుమా
ననవిలుకానివంటి నెఱనాయక యంచు విశాల వేఁడినన్. 223

క. నేనుండు చెప్పుడు మాపురి, లోన స్నాపేరు శకుఁడు లోలాయతనే
త్రానారుల మానసములు, పూని కనుంగొనెడు బుద్ధి భూమిఁ జరింతున్. 224

వ. అని చెప్పి నవ్వుచు వెండియు నిట్లనియె. 225

క. ఈవీట నొండుచిత్రము, గావించెడిపాటిదానిఁ గన మీవంటిక్
నీవైతె జాణ వౌదువు, గావ లు స్మాట లటులఁ గావినఁబడియెన్. 226

క. అదిగాక నిన్నుఁ జూచిన, మొదలుగ మదనాస్త్రతతుల మొనఁబడితి వనుం
గదియించి గబ్బిగుబ్బల, పొదుగున నీ డేర్పరతులఁ బొసఁగించి సఖీ. 227

తే. అనిన విని యావిశాల యరాశయటనుచు, మెచ్చి తనమదిలోఁ గల మేలిమెల్ల
దెలిసితివి జాణ వౌదని పలికి యతని, రమ్ము నాయింటి కిపు డని నెమ్మి మీఱ. 228

క. త్వరితగతిం దనయింటికిఁ, దిరిగి తిరిగి చూచుకొనుచుఁ దెరవయు జవనా
సరణిని వడి శకుఁ డోడఁ, శరణమునకుఁ జనియె వేడ్క సఫలతఁ బొందన్. 229

తే. ఇద్దఱీరీతి నింటిలోఁ కేగినప్పు, డొంటిపాటయ్యె శిపదత్తుఁ డింట లేని
కతన నని పొంగి యన్యోన్యకాంక్షలూర, సురతకేళికిఁ జెలరేఁగి చొచ్చి మెచ్చి.

చ. అలసటలేక సద్గుణ మందక తగ్గక తొట్రుపాటునం
గలఁగక ప్రాలుమాలక వికారముఁ బొందక యాలసించకం
దొలఁగక నిద్రముఖ్యగొని తూలక నిద్దఱు నేకకాంతుతోఁ
దలియక టోరిచానిబెడిదపుదురం బొనరించి రెంతయున్. 231

చ. లకుముకులట్లు సర్పములలాగునఁ గుక్కుటజాతిచాడ్పునం
బికములలీలఁ బావురపుబిట్టలతీరునఁ జెట్లవీఁక ధే
నుకముల వైఖరిం గపులనూఁకుడుభంగిని భైరవాశ్వయుం
గ్మకములరీతి సింహములకైవడిఁ బోరి రనూనచాతురిన్. 282

తే. అటులఁ దమిదీర కుండెడి యాస్థతోడ
ముచ్చటలు దీర నిరువురు మొనసి పెనఁగు
వేళ శివదత్తుఁ డింటికి వేగ వచ్చి
చూచె నాశ్చర్యకోపవిస్ఫురితుఁ డగుచు. 233

వ. ఇత్తెఱంగున. 284

క. ఘర్షించి కనులనిప్పుల, వర్షంబులు గుఱియఁ జూచు వల్లభునకు నా
ధర్షిణి యపు డేవిధమున, హర్షము గావింప వలయు నని యడుగుటయున్.

తే. హంసకులసార్వభౌమ నీ వనుదినంబు, కథకుఁ గథ కిట్లు నన్నడుగంగ నేల
చెప్పు మేలాగు హర్షింపఁ జేసె మగని, ననిన హేమావతిని జూచి హంసయనియె.

క. విను మటుల మగఁడు కోపము, పెనఁగొని ఘర్జించి పలుక భీతిల్లక యా
వలజదశాకారవిలో, చన ధైర్యము చెదరనీకఁ జతురత ననియెన్. 237

క. మరుకేళిఁ గవయ కవ్వలి, కరుగవె చీ రంకులాడి యని నను నిచ్చల్
నిరసింతువు యోగివ గన, నరకా నీవాకె తాఁకె నాకుంజూడన్. 238

చ. పలుమఱు రంకులాడి యని పల్కెదు నీవచనం బమోఘమై
చెలఁగొని తాఁకె సిద్ధుఁడవు నీమహిమం బదియేల వ్యర్థమై
తొలఁగు నటంచుఁ బల్కి చెలి దూరిన నాత్మతపోవిభూతిచేఁ
దలఁకొను వాక్యసిద్ధికి ముదంబు గొనెన్ శివదత్తుఁ డెంతయున్. 239

చ. అటుల నిజాధినాథుఁడపు డాత్మమహత్త్వగుణోపలబ్ధికు
త్కటమగు మోదమందఁగను గామినిఁ జూచి ననుం బతివ్రతా
పటిమ వహించు మంచు బహుభాషలఁ బల్కుము పల్కుచున్న నీ
కిటు ఘటియింతు హత్య తను వేటికి నేఁటికి నింద వచ్చినన్. 240

తే. అనెడు సతివాక్యమునకు స్త్రీహత్యకులికి, తనదువాక్సిద్ధికిని నద్భుతంబుఁ జెంది
నీవిఁక మహాపతివ్రతాభావమహిమ, వెలయవే యనియోగి దీవించెఁ బ్రీతి. 241

క. అటువలె దీవించుచు నెప్పటియట్లునె వేఱులేనివత్నంబున న
జ్జటిలుండుండెను జెలియును, బటుముదమున మెలఁగుచుండెఁ బడఁతుక వింటే.

క. ఆరీతి మహోపాయము, నేరిచిన జారుఁ గనయ నెలకొను మనవా
కారజగజంతి యని తెల్పు వారుట గని భావు కేళి ఖలతికిఁ జనియెన్. 243



వ. అని ప్రత్యుత్పన్నమతి చెప్పినవిని హర్షంబునొంది నలుండను దరువాతివృత్తాంతంబావ
తిమ్మని ప్రార్థించిన. 244

మ. నిరవద్యస్వయశోవినిర్జిత మహానీహారనీహారభూ
ధరపుత్రీశ్వర కావ్యగోత్రవిధికాంతా గౌరవా గౌరవా
కరమందార పటీర శంకర శతకా తారకా తారరా
డరవిందోద్భవవాహ పథ్యతిథిపాకాహార కాహారసా. 245

అనులోమవిలోమకందము. రామానుజరాజనుత ర
మామరసుమరాగకర సుమాకర సమరా
రామ సరకమాసుర కగ
రామ సురమమారతనుజ రాజనుమారా. 246

తోటకవృత్తము. వారణ వారణ వారణరక్షా
సారస సారస సారసపక్షా
శారద శారద శారద కీర్తీ
హారిమ హారిమ హారిమమూర్తీ. 247

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్రపవిత్రాయ్యలరాజాన్వయసుధావార్ధిపూర్ణిమా
చంద్ర నిస్సహాయకవిత్వనిర్మాణచాతుర్య నిస్తంద్రశ్రీరామనామపారాయణనారా
యణామాత్యప్రణీతం బైనహంసవింశతి యనుమహాప్రబంధమునందుఁ దృతీయా
శ్వాసము.

---

శ్రీరస్తు.

# హంసవింశతి

## చతుర్థాశ్వాసము.

### పదుమూఁడవరాత్రికథ.




రాజిత జితవారిధి
వారిధితనయాంశజాతవసుధాపుత్రీ
హారిస్తన కుంకుమఘన
సారమృగీమదనుగంధచర్చితవక్షా. 1

వ. అవధరింపుము ప్రత్యుత్పన్నమతి నలునకిట్లనియె నట్లు ప్రభాతకాలంబు గానచ్చినఁ
గనుంగొని. 2

క. చిగురాకుబోఁడి యప్పుడు, మగరాజిగిరాయిడించు మందిరభూమిన్
బగరాజిల్లెడు తొగరా, జగరాతిక నది రసించు సాయంబైనన్. 3

క. కని జలకమాడి సొమ్ములుఁ, దనరంగ నలంకరించి తగ లేక్షణరా
త్తనయునిపై మోహంబునఁ, జనఁగా రాయంచ చూచి సఖితో ననియెన్. 4

తే. అక్కరుచిఁగల్గు చక్కెర లానవాలు, పెట్టెదవె యొక్కగాథఁ జెప్పెదను వేడ్క
నది నవీనప్రవాళరాకాధరోష్ఠి, వినిన నొక్కింత సేర్పు నీకనయు సుమ్మి. 5

క. అనవిని చిఱున వ్వొలయఁ, బని చెలువులకథలు చెప్పి పార్థివుఁ జేరం
జననీయ వైనఁ జెప్పుము, వినియెద నన సతికి హంసవిభుఁడిట్లనియెన్. 6

తే. పూర్వమున బ్రహ్మసభకు నేఁబోయి కొంత
కాలమందుండి యజుఁ డంపకంబు సేయ
మానససరంబునకు వచ్చిమామకీన
కులజాలను గాంచి భువిఁ జూచుకోర్కి వొడమి. 7

సీ. హిమవన్నిషధమేరుహేమకూటాస్తోద, యద్రోణమలయవింధ్యాత్రికూట
మాల్యవన్మందర మైనాక గంధమా, దనసహ్యపారియాత్రకసువేల



ఋక్షమత్క్షత శృంగి ఋశ్యమూక మహేంద్ర, సౌమాన గోశృంగ చంద్రపృష్ఠ
కాలేయ నశిరబీజ మతంగ కైలాస, శతకేతు భృగుసీల చక్రవాళ

తే. కనక మేఘాంశుమత్పుష్పగరుడభద్ర, చిత్రకూట సుదర్శన శేషసింహ
రోహణ శ్రీగిరి క్రౌంచ రుద్ర మత్స్య, సూర్యరోహణముగిరు లూచియంత. 8

సీ. కోరింద నలతుమ్మ గొటికె కోడారయు, నెఱుతు రూఁడుగ దంతి వెట్టినిమ్మ
చిటిగార సుందర చీకెత్తుదుమ్మయుఁ, దెల్లమమ్మల్లింద కల్లితొట్టి
జమ్మి బలుసు గార చంద్రపటికి తెల్ల, వుప్పిలొమ్దుగ జిడ్డు బుడ్డతుమ్మ
కలివిరి గుండ్రియు గచ్చ పెన్నంగయు, దుద్దుసుంగయు భూత తోటుత్రికోవె

తే. మాడ్చు చిటికొక్కి సీకాయ మద్ర తొట్టి, వెలఁగ వావుడు వల్లేరు ములకవేఁప
నగిరె నీర్గొబ్బి మొదలుగా జగతిఁగల్గు, కంప లన్నియు వేవేగ గడచి కడచి. 9

సీసమాలిక. జిల్లేడు వెంపలి జిడ్డువెంపలి సైఁడి, తంగేడు తంగేడి తగిడి నుస్తె
ములువెంపలి ములుస్తె గలిజేరు గుంటగ, లజ్జగుడు దంతిబం దారి నేల
తంగేడు మెట్ట బందారి దుంఘగ బ్రహ్మ, దండి భూతులసెట్టుదొండి చల్ల
పిల్లిమాడుపు చార పిల్లడ్గు చిత్రమూ, లము నల్లతీఁగె కోలాకు పొన్న
ముయ్యాకు పొన్నయు మొగబీర తుత్తెర, బంకదుత్తెర హంసపాది గంటె
కామ జిలుగుమెట్టదామర నెత్తిసె, నగ జంబిరను కాచి నల్లకాచి
శీత్రితులసియు సంబరేణు నేలుసిరి కే, శ్వరి నేలవే మూటి చల్లగడ్డ
సహదేవి జుట్టుప చలిపిండి చిటిముటి, పెన్నేరు విషబొద్దిపిండి దొండ
నెనుటాయి గొలిమిడి నీరుబచ్చలి ప్రబ్బి, వేరు గన్నేరాఁడు బీరనేతి
బీరపేరా ముట్టి పీచరములు గొలి, మిడి చేదుపొట్ల యుమ్మెత్త తిప్ప
తీఁగె విష్ణుక్రాంత తీండ్రిత్త చిత్రమూ, లము దొండతీఁగె ముల్లంగి గొల్ల
జీడెద్దు మర్రేకు చేగొడ్డ చంద్రకాం, తెజ్జనియుబ్బెంద యెత్తుమ్మి
కుప్పి సూర్యక్రాంత మువ్వడు నరవండు, గాడిదెకడపర కస్నెకొమర
నల్లగంటెనపూలి తెల్లగంటెన యుత్త, రేణు గుబ్బిరి సంబరేణు బండి
గురిగింజ గురువింద తురతపత్తియుఁ బత్తి, తిలదిడ చబ్బంది నులియచీకె
వెలగ విషముదారి వెత్తికుందెన మంచి, కుందెన కలబంద గువ్వగుత్తి
మామెనయును నేలమామెన యటకమా, మిడి దూల గోవెల మేఁకమేయు

తే. నాకు నల్లేరు నులిజము డాకుఁజెముడు
నేలతటక సిందెయుఁ గోలచెముడు
బొంతచెము డుళ్లియును, సదా ముష్టి మొదలు
గాఁ గలుగునట్టి చిఱుపట్లఁ గాంచి యంత. 10

సీసమాలిక. రావి మామిడికొండరావి మేడియు ప్రష్మ, మేడియు జీడిమామిడియుఁ జింత
పులిచింత మోదుగు ములుమోదుగును నెల్లి, పుల్లవెలఁగ వెట్టిబిల్ల చిల్ల
బూరుగ కలుగొట్లు భూత పాసిరి కుక్క, బూరుగ చిటిగొట్టి భూతనెరిద
నేరేడు మఱి యల్లనేరేడు పాచెరి, తడగూబ తడఁబేఁడు కడపబట్ట
కడపకొడిశ పాలకొడి శెట్టిలొద్దుగు, చిరిబేఁకు లొద్దుగు జీడిపాల
కలు జువ్వి వావిలి గండువావిలి యేఱు, మద్ది మగ్గియును నేలొద్దియొద్ది
తెల్లకాంచనము తుందిల మెట్టకాంచన, ముప్పి తెల్లుప్పి నీరుప్పి యిప్ప
తాండ్రిచందన మేపి దాసాన మెఱ్ఱదా, సానము బందుగ జారజేన
మఱ్ఱివిరికి తొండ్లి మఱ్ఱితూ కిచ్చెడ, పెద్దవిరిగి వక్కి గద్దనెల్లి
కాకితూ కందుగుకానుగ పరగోఁగు, గోఁగుబొట్టు కచిక్కి గోఁగుకొండ
గోఁగుపొగడ ములు గోరంజలును బెద్ద, వెలమ సుంకేసరి వెఱ్ఱిచిక్కి
నాఱప సురపొన్న వారిజమును బొన్న, నెల్లి మాలుగబిల్లు నెమిలియగుడు
కొండగుమ్ముడు రేఁగు గొరమి సంపఁగికొండ, సంపెంగ మారేడు సరళదేవ
దారు గుమ్ముడు మోవి తపసియుఁ గుమ్మర, పోల్కి గుగ్గిల మెఱ్ఱిపోల్కి వేగి
దేవదారు సిరికె తిలకము తెల్లన, గిరి వేఁప కరివేఁప తురకవేఁప
వేరుపనసగుత్తి వెఱ్ఱినారు వరేల, పనస కరకకొమ్మి పలుకరేణి
బండచింతయు నల్లబలుసు నురభి చీకి, రేని కూకుడు నెమ్మి పేర్రింఖణమ్ము
భూతాండసళ మశోక భూర్జపత్రమ్ములు, బోళము మంకెనపులును గంగ
రేఁగు తక్కిలి ములువేగి భూచక్రము, మొక్కస కొక్కస మొల్లమ్రాను
హనుమంతబీర మంకెన గిరికర్ణిక, పెడమల్లె కొండముక్కిడియుఁ గోల
ముక్కుదాడిమ బీర మొగలింగ గోదాడు, నేదాడు ఖర్జూర మీఁత నేల
తాడి బగిస పోఁక తాడు కొబ్బెరచెట్లు, పెద్దమాను పతంగి బెండగలుగు
తే. కఱుదు రిరుసడు కాఁకిగ కాన్గ సన్న,
విరిగి సోమింద గున్నంగి దిరిసెనంబు
మొదలుగాఁ గల్గు బహువిధభూరుహములు
నిండి యుండెడు కొనలపిండు లరసి. 11

క. వెస జంబూప్లక్షక్రౌం, చసుపుష్కరశాల్మలికుశ శాకద్వీపా
లెసఁగఁ గనుగొంటి లవణే, క్షుసురాఘృతదధిపయోవిశుద్ధజలాబ్ధుల్. 12

సీ. స్వాయంభువోత్తమ స్వారోచిష బ్రహ్మ, దక్ష వైవస్వత తామసేంద్ర
రౌచ్య రైవత రుద్రభౌచ్య చాక్షుష సూర్య, లనెడు చతుర్దశమనువు లమరి



బ్రాహ్మ్యర్ష దివ్యబార్హస్పత్య సౌరచాం, ద్ర గురు పావన పితృనామకవన
మానవమ్ములును గేతుమాల కింపురుష హి, రణ్మ యైలావృత రమ్య కకురు
తే. భరత భద్రాశ్వ హరిసంజ్ఞ వర్షములును, భారతేంద్ర కశేతు గభస్తి నాగ
తామ్ర రోహిణి సౌమ్యగాంధర్వకాఖ్య,లమరు నవఖండముల నొప్పు నవనియందు.

సీ. ద్రవిళ విదేహ మాళవ మత్స్య మళయాళ, కొంక ణాంగ విదర్భ కురు పుళింద
చేది టంకణ వత్స సింహళ కర్ణాట, మగధ ఘోట కళింగ మద్ర యవన
కుకురు బాహ్లిక పౌండ్ర ఘూర్జర నేపాళ, శక వంగ కాంభోజ సాల్వ లాట
సౌరాష్ట్ర చోళాంధ్ర శబర పాండ్య వరాట, కుంతల కేక యావంతి కాశి
తే. నాట కరహాట సింధు గాంధార నిషధ, కేరళ తురుష్క పాంచాల శూరసేన
కోస లోత్కల కాశ్మీర కుత్స బర్బ, రమరు హూణాఖ్య సర్వదేశములు చూచి.

క. యమునాతమసామధ్య, క్షమఁగమలోత్పలమరందసంగ్రహణాద
భ్రమతిభ్రమద్భ్రమరవి, భ్రమగీతతతాభ్రసురతరంగిణి చెంతన్. 15

సీ. పొడయెండ గాయని పొన్నగున్నలనీడఁ, గ్రొమ్ముత్తియపుటరంగులు చెలంగ
గొజ్జంగి పొదరిండ్లపజ్జలఁ బచ్చక, ప్రములు నిండిన ద్రాక్షపందిలి తగ
శశికాంతకుట్టిమస్థలులను బన్నిటి, పరజల్లు జలయంత్రపాళి దనర
కేళి కేళాకూళి క్రౌంచ చక్ర చకోర, హంసభ్రమత్సారసాదికలిత
తే. కలకలారావ విస్తార కమల కుముద, సౌర భాగార నీహార నీరపూర
వీచికావార దుర్వార విహృతి ధీర, శీతలసమీర కాసారసీమఁ గంటి. 16

వ. మఱియుఁ దత్కాసారంబు ననిమిషసంచారయోగ్యంబై యమరావతీపురంబును, శంఖమకరకచ్ఛపాధిష్ఠానంబై యలకాపట్టణంబును, ధార్తరాష్ట్రవిహారస్థలంబై హస్తినగరంబును, బకనివాసంబై యేకచక్రంబును, శంకరాధారంబై కాంతారంబును, శింశుమారచక్రవికాసితంబై మేరువునుం బురుడించుఁ దత్తీరంబున. 17

క. పల్లవిత కలిత పుష్పిత, సల్లలిత మరంద వళిత సత్ఫలిత మహీ
జోల్లసితాభ్రంకషమై, యుల్లము రంజిల్లఁ జేయు నొకవన మొప్పెన్. 18

ఉ. అవనసీమ నొక్కతరు వంబరచుంబితశాఖియై ముదం
బావహిలంగఁ జేయఁ గని యాగమనశ్రమముక్షుధార్తియుం
బోవఁగుటింపఁ బూనియును భూజముపై వసియించి నాకగం
గావనజాతజాతబిసఖండము లానుచు నుంటి నయ్యెడన్. 19

ఉ. కొండలు క్రిందుమీఁదుగను గూల దిశావళి వ్రీల నుష్ట్రవే
దండము లుర్వి వ్రాలఁ దద్వరితంబున వారిధు లింకి క్రాల బ్ర

ష్ఠాండమూ తూల నాదిమసహోహిపసూకరకూర్మమూర్తు లొం
డొండఁ గలంగి సోలఁ జటులోద్ధతి నుర్లెను నేలయ న్నొగిల్. 20

వ. అప్పుడు. 21

చ. హరిశిఖిదండిదైత్యవరుణానిల యక్షపభర్గు లెక్క యా
మరకరిమేషవాహరిపుమానపనక్రమృగాశ్వనందులన్
గురుపవిశక్తిదండపరకుంతగుణధ్వజఖడ్గశూలభృ
త్కరులయి కుంభయంత్రగతిఁ దాల్చిరి దిక్పరసైన్యసంగతిన్. 22

క. అతఁడి నేనాకసమున, కౌతతసంరంభగతుల నతిజవ మొప్పం
గాఁ దెలిపి నెగసి చూడఁగ, భూతలచలనం బడంగి పోయినపిదపన్. 23

క. ధరణీసుర భూభృద్వి, ట్పరణజభటరథగజాశ్వపద్యస్తులచే
నిర వొందు పాండ్యభూమిని, బరిపూర్ణం బనఁగ నొక్కపట్టణ మున్నన్. 24

తే. కని మహామోద మొనరింపఁగాఁ బురంబు
కాపురంబుగ నుండెడు ఘనజనముల
కలిమి బలిమియు వీక్షించు కొంత్ష వొడమి
యొక్కసౌధంబుపై డిగ్గి యుంటి నందు. 25

తే. పరకతలగుడ్డ యొకపాటిపచ్చడంబు,ముదుక నీర్కావిదోవతి మొలనుసంచి
తిత్తి వెండుంగరము వ్రేలహత్తి యొప్ప,నుండు శతుఁ డను పేదనియోగి యొకఁడు.

సీ. క్షేత్రఘాతంబులస్థితులు వక్కాణించి, సౌవర్ణగణితోక్తసంఖ్య దెలిసి
మిశ్రితగణితార్థమిళితమనన్యుఁడై, గాఢప్రకీర్ణకగణిత మెఱిఁగి
త్రైరాశికాద్యంతసారాంశము గ్రహించి, సూత్రగణితంబులు జొచ్చికలఁచి
మఱిభిన్నగణితంబు మార్గమెల్లను గాంచి, పరగణితంబులు పారఁజూచి

తే. నిఖిలసిద్ధాంతసూత్రము లెన్నరిచ్చి జగతి
గణకకులసార్వభౌమత్వగణనకుఁ దగి
గణితమర్మజ్ఞుఁ డితఁ డని ఘనులు మెచ్చఁ
దెలిసి యతఁ డెంతలెక్కైనఁ దేటపఱుచు. 27

గణితముపేరులు.

సీ. త్రైరాశికప్రకీర్ణసువర్ణపంచరా, శికమేరుపొర్ణరాశికసమాధి
కారవీరాచారఘాతకుంటాహ్వయ, చ్ఛాయార్యభటబృహజ్జాతకోత్క
లితసప్తరాశికలీలావతీవర్గ, వర్గమూలక్షేత్రవాస్తుభాగ
గణితసారచతురంగప్రశంసాఫలీ, నాదియబీజభిన్నవరాశి

తే. ఘనఘనామూలశిల్పిసంకలితసూర్య, సోమసిద్ధాంతయుగలబకోధరత్న



ఘట్టితైకోనరాశ్యాదిగణితతతులు, దెలిసి యతఁ డెట్టిలెక్కైనఁ దేటపఱుచు. 28

తే. సరవి గుడికట్టుగా చెంగ వరసి వ్రాసి, యంతకము లేసి కులవర్గు లాయకట్లు
దీర్చి దినపహీనపరగతిప్రతీర, సారవణి నిర్ణయింప శేషాహి యతఁడు. 29

చ. చదువులుచెప్పి చూచె మతిసారెకుఁ గూలికి లెక్కవ్రాసి చూ
చదయతఁ గోలుకాఁడగుచు నన్నిఁట మండువలన్నటించి చూ
చదియునుగాక రాయసపుటార్యుల ఘంటము లాపు దుద్దులున్
వదలక మోసి చూచె నొకపట్టునఁ బొట్టకు లేక తక్కినన్. 30

క. పొరుగిరుగువారికలిమికి, గుఱిగాఁ దా నెంతకూడు గుడుచుచు వీటం
దిరుగాడి ప్రౌఢుగ్రుంకెడు, వర కాకపాతికకుఁ గొలుచు వడిఁ గొని తెచ్చున్.

తే. తెచ్చి సుఖమతి యనునామధేయమునను
పరఁగు ప్రియురాలిచేతి కేర్పడఁగ నీయ
నాబిడన్నంబు సంకటి యంబలియును
జేయ సమరేయివేళ బోసేసి పోవు. 32

క. అతఁ డీలాగున గ్రాస, స్థితికై యూరెల్లఁ గలయఁ దిరుగాడంగా
నతనాలు మరునికేళికి, వెతఁగొని తిరుగున్ భుజంగవీరులఁ గలియన్. 33

క. ఒసపరి వగలది ముద్దుల, నసియాడెడు గౌను గలది యందము గలపైఁ
డి సరైనమేనుచాయల, వస గలదని విటులు దానిపని కలవడుచున్. 34

తే. ఎనయు నేవేళ నెందైన నేపు రేఁగి
పురిని గలజారు లత్యంతమోహు లగుచుఁ
గ్రుక్కిళులు మ్రింగికొనుచు నొక్కొక్క రొకరె
తిరుగుచుందురు దానింటితెరువుఁబట్టి. 35

ఉ. ఇందుఁడు కందునిద్దపురహిం దగు సుందరిమోముగోము తా
నందమి నెందిరేందుముఖినందనుఁడుం దన డెందమందు నిం
దిందిరకందబృందకచదృక్తతిచందముఁ జెంద జాళువా
లొందమిఁ గుందు జారులిఁక యుగ్మలిఁ బొందమిఁ గంది కుందరే. 36

శా. నెత్తావు ల్వెదచల్లుపుష్పలతల న్నెమ్మేను సింగంపురా
మొత్తంబున్ నునుగౌను శ్రీలగరిమంబున్ వీనులుం దమ్ముద
మ్మొత్తుం గ్రొవ్విరిగుత్తులన్ మినుకులొల్కున్ గబ్బిచన్గుబ్బలున్
నెత్తమ్మిన్ గళికేరువారాము దెగడు న్నీమాటికీ రంభన్ నగ్రున్. 37

క. అనుఖమతితరుణవయస్సు, శ్రీసంగతి నలరు విటులఁ జేరి రతులకున్
వేసారక సుసికొల్పఁగఁ, దా నుఖమడి పచ్చునట్టి నస్యూలలోనన్. 38

చ. ఒకనికి మోముచుంబనము లొక్కనికిన్ మొనగుబ్బపోటు వే
ఱొకనికిఁ జెంపపెట్టు మఱి యొక్కనికిన్ బిగికౌఁగిలింపు లొం
డొకనికి గాఢసంగమము లొక్కనికిన్ రతిబంధనైపుణుల్
కకవిక చూపు మన్మథుఁడు గట్టినధట్టి సడల్ప నియ్యకన్. 39

చ. దుసికలఁ జారుచీఁకటుల దూఁకొనుచుండెడుకీలుగంటుపైఁ
బస పొనరించునిగ్గు గల ఫాలతలంబునఁ జాదుబొట్టు దృ
గ్వసతికిఁ గజ్జలంబు నరకాలున వంచులుఁ జీఱుచీరఁ దా
రసమగుపుప్పకంచుకము రంజిలఁగాఁ జరియించు వీథులన్. 40

తే. ఇటులఁ జరియింపఁగా దాని యొప్మై లెఱిఁగి, పట్టియనుమానములచేత బెట్టుగుంది
కని విరూపినిఁగాఁ జేసి కాంతవిడి, చనియెద నటంచు నెమ్మది శతుఁడుఁ దలఁచి.

క. ఒకనాఁటిరాత్రి యింటను, సకియకడం బవ్వళించి సంభ్రమమునఁ బౌం
డ్రకదేశమునకుఁ జనియెద, నొకపని కని వేగ యామ ముండెడువేళన్. 42

తే. పయనమై లేచి పోవుచో భార్యతోడఁ, జెప్ప నొక్కింతదూర మచ్చిగురుబోఁడి
సాగ నంపి బహిశ్శంక కేగ నతఁడు, దిరిగి కిసురించి వేగ మందిరము సొచ్చి. 43

ఉ. దూలముమీఁదియుట్టుకను దొంగవిధంబున నిశ్చలాంగుఁడై
తాలిమిఁ జిక్కఁబట్టి కులతామరసేక్షణచర్యలెల్ల నా
మూలముగాఁ గనుంగొనెడు బుద్ధిని నాశతుఁ డుండునంతఁ బ్రా
క్శైలశిఖాగ్రభాగమున సారసమిత్రుఁడు దోఁచె నంతటన్. 44

క. పనిపాటఁ దీర్చి సుఖమతి, పనిపడ నేఁ డింటితోడుసు బొసెఁగదా యం
చును వెల్వడి చని వీథిని, మనసిజవేదనల జాలి మాలి తిరుగఁగాన్. 45

సీ. గౌరిపంచాంగంబు గౌళిపంతులపంచ, పక్షుల శకునము లై ఱేఁడికంటి
పలుకులరీతులు ప్రశ్నభాగంబులు, గల్యాలు గూఢంగఁ గలుగుమేలు
కీడును బోచిల్లజా డెఱింగెడునేర్పు, దిక్కువిదిక్కులు దెలిసి నుడువుఁ
దుమ్ములక్షణములు తొడరు కాకరవంబు, సాముద్రికస్థితిఁ జతురమహిమఁ
తే. దెలియ నేర్చినయొకమహాధీరవరుఁడు, శకునవిద్యావిచక్షణాధికుఁడు సొకు
మార్య రేఖల మార్కట మారుఁడైన, యనవిదివిజ్ఞుండు మతిమంతుఁ డనెడువాఁడు.

క. ఎమకైనఁ జూచి సుఖమతి, కదియం జని వాని సొబగు కలిమికి మోదం
బెదనొంది యతని నో నవ, మదనా యని పిలుచునంత మాత్రనె యతఁడున్.

తే. దీనిఁ దగిలించుకొనవలెఁ దియ్యవిలుతు, దురము సనిల్లొకి నేఁడు ముద్దుగ నటంచు
ఫలఁచువంతటిలోన జాణతనములాడి, లోఁబఱచి వానిఁ దోడ్తెచ్చె లోలనయన.



మ. అటులం దోడ్కొనివచ్చుచోఁ గలుకు టొయ్యారంబుగాఁ జూచి చొ
క్కటపుఁ బిబ్బెపుగబ్బిగుబ్బ నెలవంక ల్సాము గాన్పింపఁ బై
పట మొక్కింతి సడల్చుఁ బచ్చిదొరలన్ భాషించు లేనవ్వుతో
సటులుం జేష్ట లొనర్చుఁ బైపయిఁ బమున్ జారుండు హర్షింపఁగన్. 49

చ. నిలయములోని కిట్లు విటు నిన్ వెసఁ దోడ్కొని వచ్చి హెచ్చి కం
బళము ముదంబునం బఱచి పల్లవుఁ డందు వసించినంత న
య్యళికచ యేక్రియం గనెనొ యట్టుకపై నిజభర్త యుండుటం
దెలిసిన భీతిలేక సుదతీ యపు డేమని బొంకెఁ జెప్పుమా. 50

చ. అని యలవాన జాలిపులుఁగా వనజాక్షినిఁ జేరి వేఁడినన్
విని తలపోసి చూచి యిది వింతసుమీ తెలియంగలేను నే
ర్పున నది భర్తకింపు మదిఁ బుట్టఁగ నెట్టులబొంకెఁ జెప్పవే
యనఁ గలహంస వంశకల శాంబుధిచంద్రుఁడు కొంత కిట్లనున్. 51

క. విను హేమావతి సుఖమతి, తనవల్లభుఁ డటుకమీఁద దాఁచుక యున్నాఁ
డని తెలిసి ధృతి చలింపక, యనుపమచాతుర్యధుర్య యై విటుమోలన్. 52

క. ఏకొక్క కిడి సద్భక్తిని, మ్రొక్కి కసుంగీఁటి శకునములు చూడు వరుం
డెక్కార్యంబున కేగెనొ, యక్కార్యము లెసఁగ సఫల మౌనో కావో. 53

తే. లెస్సఁగాఁ జూచి చెప్పుము లేమిచేతఁ
జనిన నాపతి శీఘ్రంబె సఫలుఁడై సు
రక్షితంబుగ వచ్చునో రాఁడొ యనుచుఁ
దెలుప యడిగిన నాసైఁగఁ దెలిసి యతఁడు, 54



సీ. అంగుళిక్రమమున నశ్విని భరణియుఁ, గృత్తిక రోహిణి మృగశి రార్ద్ర
పొసఁగఁ బునర్వసు పుష్య మాశ్లేషయు, మఖ పుబ్బ యుత్తర మఱియు హస్త
సరవిఁ జిత్రయు స్వాతి వరుఁగ విశాఖాను, రాధలు జ్యేష్ఠయు రమణ మూల
పూర్వోత్తరాషాఢ లుర్విని శ్రవణ ధ, నిష్ఠలు శతభిష ప్రోష్ఠపదలు
తే. నుత్తరాభాద్ర రేవతు లొనర నెంచి
మేష వృషభ మిథున కర్క మృగప కన్య
కౌతులాళి ధనుర్లగ్న కలశ మీన
రాశి సంఖ్యలు వరుస నేర్పడ గుణించి. 55

తే. సూర్య శశి భౌమ బుధజీవ శుక్రమంద, రాహు కేతుగ్రహస్థాన రాశికూట
చారహోరోపచయకేంద్ర సారసిచ్చ, పరమసోచ్చాంశలగ్నము లుదిలపఱిచి. 56

తే. జన్మకర్మసాంఖ్యాతిక సామదాయ, కౌంగజామిత్రవైనాశికారివామ
పార్శ్వవేధలులత్తలు భావమస్వ, భావసిచాస్తమయయములఁ బరిహరించి. 57

సీసమాలిక. ద్వాదశాబ్దాబ్దమాత్రగ్రహమాత్స్య, క్షుత్త్రాంశరాశిమాసదిన మరసి
పద్మసింహాసన పణకూర్మనరచాప, కుంతలఖలజీవ కుంభవర్గ
శనిఖడ్గరథగజాశ్వవ్యూహనాడికా, దిద్విధచ్ఛత్రద్వితీయపంచ
విధదశవిధరాహు వృశ్చికలాంగూల, పంచసప్తశలాక పక్షిడింభ
కామాఖ్యతోర్మణ గౌళిత్తుతశ్యేన, యాత్రాత్రికాలసూర్యఫణిజయక
ఘోరకాలానల గూఢకాలానల, భూచరఖేచర పుణ్యభూమి
చంద్రకాలానలసంకటసూర్యకా, లానలరాహుకాలానలకలి
వర్తులభాస్వరవామగౌడద్వితీ, యతృతీయమాతృకా చతురదీర్ఘ
వర్ణేశ్వరాహ్వాద్వె వతయోగతుంబురు, ప్రస్తారసర్వతో భద్రకులక
లాలకోటావహా లక్ష్మీనఖక్షితి, వలయలక్షత్రేత్రవాలభూమి

తే. ఘనపుళిందకోల్లాపురి వెనకపటక, కాలరేఖమహామాలి కానిరామ
యాఖ్య అలంకారచక్రము లందు బీజ, పంక్తి లిఖియించి తత్ఫలా ఫలము లరసి.

క. ఈలాగుచక్రముల గ్రహ, జాలము లిఖియించి చూచి చంద్రాస్యవరుం
డాలయమున డాఁ గుండుట, కాలజ్ఞుఁడు దెలిసి పలికెఁ గౌతుక మెసఁగన్. 59

తే. కడుపులోఁ జల్ల గదలక కలికి వినుము
నేఁడు రేపటఁ దలపువ్వు వాడ కతఁడు
రాఁగలఁ డటంచు శపథ మేర్పడఁగఁ జెప్పి
యతఁడు దానిల్లు వెలువడి యపుడ చనియె. 60

ఉ. ఆసమయంబునందు శతుఁ డట్టుపపై వసియించి యుండి యెం
తో సుముఖత్వ మొప్పఁ గని తొయ్యలిభక్తికి సచ్చరిత్రలీ
లాసుగుణప్రసిద్ధికి భళా యని మెచ్చుచు డిగ్గి వచ్చి రా
వే సరసీరుహాక్షి యని వేగమె కౌఁగిటఁ జేర్చి వేడుకన్. 61

క. ప్రమదానిపాతివ్రత్యము భక్తియుఁ గంటి సందియము లేదిఁక నం
చు మనోరాగంబున శతుఁ, డమితస్తుతు లొనరఁ జేయ నది యిట్లనియెన్. 62

తే. కాంత నే నెన్నఁ శూరాదు గాక నన్నుఁ
బోలఁ గలసాధ్వు లున్నారె పుడమిలోన
[illegible]
[illegible]



చ. అని కలహంస చెప్పిన నయారె కథాస్థితి యంచు మెచ్చికొం
చును దపనోదయప్రభలు సుందరి గన్గొని యింటిలో నికిం
జని పవలెల్లఁ బోఁగడపి సారసమిత్త్రుఁడు పశ్చిమాద్రికిం
జనినయనంతరంబ మనుజప్రభుపై విరహంబు మీఱినన్. 64

సీ. కళదేరు కస్తూరితిలకంబు వాసన, ల్లపనవంధములకు లంచ మొసఁగ
నవరత్న తాటంక వివిధకాంతిచ్ఛటల్, సునుఁజెక్కుఁ జిగికిఁ గానుక నొసంగ
నలరుమానికపుసోయగంపు దండల మెక్కు, కలితాంగదీప్తికిఁ గట్న మిడఁగఁ
జెంగావిపలి పెంపు చీరంచు సరిగడా, ల్పదశోణఘృణులకుఁ బగిడి బెట్ట

తే. మదనమదహస్తివిడివడ్డమాడ్కిఁ బడఁతి, పుడమి యొడయనికడ కేగ బెడఁగునడల
నడుచువడిఁ గడుక్రొమ్ముడి సడలి విరుల, జడి పాదను నిల్లు వెలువడి చనఁగనవుడు.

క. కని రాజహంసవరుఁ డి,ట్లను భళి మేల్జాణ వౌదువౌ సొగసు మెఱుఁగ
జననాథు సెనయఁ బోయెదొ, విని పొమ్మొకకథ యటన్న వెలఁది యిట్లనియెన్. 66

మ. కలహంసాధిప నీవ్వబుద్ధి నిటులం గల్పించెదో కాక పె
ద్దలచేఁ బూర్వము విన్నవాఁడవొ మహాదైవప్రసాదంబొ విం
తలును మ్మట్లు రచింప నన్యులకు మేధాశక్తి నిక్క బోలువా
రలు లేరింక భళారె చెప్పు మనుచుం రాజాస్యప్రార్థించినన్. 67

---

## పదునాల్గవకథ.

క. ఆహూనసౌక మభినవ, తామరసమరందబిందు తరబృందంబుల్
నేమించుగుఱియు వాక్కుల, హేమావతి కనియె మోద మిగు రొత్తంగన్. 68

చ. వినుము విదర్భ దేశమున విశ్రుతమై సిరులందు విప్రాలం
బన నొకపట్టణం బమరు నచ్చట నొండొకవైశ్యుఁ డెంతయుం
దనరు హిరణ్యగుప్తుఁ డను నామముతోడఁ దదీయభార్య హా
స్తిని యనుపేరునం బరఁగుఁ జెప్ప నశక్యము దానివైఖరుల్. 69

క. మిలమిలమిలఁ దసుకులజలు, పాలయలరుల వలపుగులుకు పొలతుఁక నవ్వుల్
మొలకరిక ల్చలదలకలు, చెలిసొలపులపలుకు లలరు చిలుకలకొలికిన్. 70

క. విరులా నగవులు నీలపు, సరులా కుసులంబ్బుగబ్బి చన్నులు జాళ్వా
గిరులా యూరు లవంటుల, సిరులా యని జనులు మెచ్చఁ జెలువ చెలంగున్. 71

క. చిందం బనఁదగు గళమును, గుందమ్ములతీరురదన కోరకపంక్తుల్
మందమ్ములు గమనమ్ములు, నందమ్ములు పొగడఁ దరమె యతివపదమ్ములున్. 72

ఆ. కలువచెలువు చెలువుఁ గైకొనుకన్నులు, జగ మెఱుంగురంగు జిగి మెఱుంగుఁ
గులుకు దొలుకు మొలకగుబ్బల పసగల, వనిత మేలు కొక్క వనిత మేలు. 73

సీ. బలితంపుఁ బులినంపు వెలఁబెంపు జఘనంబుఁ, బోఁడి మెన్నఁగనొక్క నాఁడు పట్టుఁ
విరితమ్ములను గ్రమ్ము సిరిజిమ్ము వదనమ్ము, చెలువ మెంచుట కొక్క నెలయుఁ బట్టు
నిగులెప్పుడును గుప్పు నెఱికప్పు గలకొప్పు, వర్ణింపగా మహాబ్దంబు పట్టు
జితజంభకరికుంభతతడింభ కుచకుంభ, యుగ మెన్నుటకు నొక్క యుగము పట్టు
తే. జొక్కటపు టిక్కగమినిక్కు టెక్కుజక్కు, సుఖములనుతింపగల్పకాంతంబు పట్టు
గెంజిగురు సంజకెంజాయపుంజిఁ దెగడు, పదము లెన్నంగ బ్రహ్మకల్పంబు పట్టు.

క. ఘనజఘన స్తనయుగములు, వెనుకను దను మ్రోల నుద్దవిడి నొత్తంగాఁ
జనలేక యూరుమురుఁగులు, బనుపడ దాఁగెనఁ గొను భామమఁదనరున్. 75

సీ. విష్ణుపాదంబంటు వేమఱు మేఘంబు, చంద్రుండు ముట్టె నీశ్వరుశిరంబు
తీర్థంబుతోఁ గొని ధృతి నిల్చె శంఖంబు, కోరి ప్రసాదంబు గొనె ఘటములు
దండనుండిన సాధుతరులదాఁ టెనులత, లతనుధర్మములతోఁ దనియె విరులు
పుణ్యనదీనదంబుల నిల్చెఁ బులినమ్ము, లలపితామహునాజ్ఞ నలరె నంచ
తే. కుంతలానన కంధర కుచసు బాహు, నఖకటీయానపటుశోభనత వహించి
దీటురావే మటంచును దృఢమనీషఁ, జెలియ యంగమ్ములకుఁ బాస చేసినటుల.

ఆ. మొగము నిండియుండు మోహంపుఁగన్గవ, యురము నిండియుండు నుబ్బుచనులు
వీఁపు నిండియుండు వేనలిజొంపంబు, దానిఁ బొగడఁ దరమె మానవులకు. 77

క. అహ స్త్రీని యౌవనము, త్సాహమునన్ బిడ్డపాపసందడి లేమిన్
మోహనతరవిటవృషభ, వ్యూహములకు వల్లెత్రాఁటి యొఱపున మెఱయున్. 78

చ. మిడిమిడి గానిచేకటులు మేలిమిసూనలదండ జోడుబోల్
కడెములు సందిబొందె విడి కమ్మలమించులమించుమించులన్
నిడి బుగడల్ జరాసరిహొణీలఁ దనర్చినకట్ల దండచే
గడ కుతికంట్లు సూసకము ఘల్లను మెట్టెలు పూని వీఁగుచున్. 79

క. అది గరగర నగుపురుషుం, డెదుటం బడ వీఁడు జీవితేశ్వరుఁ డయినన్
మది గలదుఃఖం బెల్లను, దుదముట్టు నటంచు మోహ దుర్దశ నొందున్. 80

వ. అది మఱియును.



చ. ముదమునఁ బల్లెబట్టలకు మూఁటను ముల్లె కటంచు నాథుఁ డిం
పొదవఁగ నేగ జారజనయూథహితప్రదభాగధేయ మై
కదిసి చరించుఁ జిన్నెలను గాసిలఁ జేయుచు మోహకాంక్షతో
మదనుఁడు సానచిమ్ములు సుమాళముతోఁ దుతఁ జిమ్ముచుండఁగన్. 82

వ. ఇట్లు సంచరించు నయ్యవసరంబున. 83

సీ. హారాది యొడ్డాదిభారానులను వచ్చు, గోనెలు తణగాలు గోతములును
సూలానునగలు కంట్లాలు కంబడికట్లు, మూఁటలు చిక్కాలు బాటసుండు
వలలావణము పట్టి వారతుక్కొఁబను, సుంకము బీటికాసులును మగలు
కావలి దేవళ్లకానులు కుప్పబ, త్తెము విశేషము దోవతీర్వ యర్థ
తే. మాన్యములు తరుగువిడుపునుమడుపుమణియ, గానికొల్లానిబంటొ్రతుకరణములకు
నారిపెట్టి బసివిగణాచారు లచట, వాదిలెక్కలు రాఁబట్టువాఁ డొకండు. 84

ఉ. సుంకరకొల్వుకాఁడు సరసుం డనుపేరిఁటివాఁడు చూడ నే
ణాంకవసంతకంతుల జయంతుని నెంతయుఁ బోలువాఁడు ని
శ్శంక నలంకరించుక హుశారున వీథికి వచ్చి యప్పు డా
పంకజలోచనం గని సెబా సని మెచ్చినయంతలోపలన్. 85

చ. పొగడలు చారుచెంగలువబొందల మేలకిపువ్వు ధట్టి సం
పఁగి విరితేఁటిమేల్గనినపాగ శిరీషపుగోషు ఫేషు మేల్
జిగితొగడాలు జాజిబరిసిం గొని చిల్కలవాజి నెక్కి పెం
దెగువను గంతుపాదుష హదే యని యార్చెద వొమ్ము గ్రమ్మినన్. 86

సీ. వ్రీడావహిత్థప్రవేగోన్మదోగ్రరో, షప్రదోషవితర్కచపలదైన్య
మతిసుప్తత్రాసకచరమలీలాపని, ర్వేదనాసూయవిషాదగర్వ
మోహాంచితాస్మృతిమోహనమాధుర్య, జడసుప్తిధృత్యపస్మారహైన్య
హర్ష విజ్ఞానశం కాలస్యసుఖనామ, ధేయముల్ గల్గి వర్తిల్లునట్టి
తే. ముప్పదియు మూఁడు సంచారములను బ్రగ్గి, స్వేదవైవర్ణ్యలోమాంచ విశ్రుతాస్య
కంపముల్ ప్రళయ స్తంబకము లనఁ జను, సాత్త్వికపుభావములచేత జడిసి తెలిసి.

సీ. సాక్షాత్కరించిన చంచలాలతికయో, మాటాడ నేర్చిన మణిశలాకో
జీవంబువచ్చిన చిత్తరుబొమ్మయో, కడురూపుదాల్చు శృంగారరసమొ
చేష్టలు వెలయించు చివురుపూరెమ్మయో, చెఱలాడుజాబిల్లిచిన్నికళయొ
కలితరేఖ నటించుకమ్మనెత్తావియో, మోహింపఁ జేయు సమ్మోహనంబొ
తే. కాకయుండిన నీతళుకు కాంతిముఱువు, సొగ సలంకృతికళయును సురభిశుభద
విభ్రమంబులు గలవె త్రివిష్టపముల, నిండి యున్నట్టి చక్కనిసెలఁతలందు. 88

క. కరములు సుమలతికాళిన్, కరములు చిగురువవ్వు లబ్జకరములు పద్మా
కరములు నాభీరుచు లా, కరములు సొగసులకుఁ జెలికిఁ గలయవయవముల్. 89

క. నారికెన సఖులు లేరే, లేరేదొరఁ దెగడు నిటలలీల లయారే
యారేవునమరు నారే, నారేఖకుఁ దనుఘనాళి నాఁగను మెఱయన్. 90

క. బాలాద్యుక్తి వాలా, వాలాఱుఁగన్ను లతులవనజశ్రీలా
శ్రీలా చెవులు సులీలా, లీలావతికంధరపము లెరబాబాలా. 91

సీ. శశిరేఖశశిరేఖ సత్కళాసౌందర్య, ములు మాయఁ జేయు నిచ్చెలుపతీరు
పద్మినీపద్మినీపరిమళజాతుల, నలరింపుచుండు నిక్కలికిసొరు
రేవతీరేవతీరేఖావిలాసముల్, తలకింపఁ జేయు నిత్తరుణిమురువు
వరహేమవరహేమసురుచిరలీలలు, గఱఁగంగఁ జేయు నీకాంతహరువు
తే. తారతారనుదారనుదారసించు, భద్రభద్రను భద్రను బరిహసించు
నౌర యిట్లుండ వలదె శృంగార మనుచు, మెచ్చి పల్మాఱు బలుమోహ మెచ్చి కెరలి.

క. మిఱు కైనయాకృశాంగీ, మణి నిప్పుడు మోహినీసుమతమంత్రాక
ర్షణకళ నాకర్షించక, కణకం బలుగతుల రతులఁ గవిసెద ననుచున్. 93

క. మది నూహచేసికొని తన, సదనంబున కపుడె వచ్చి చలమునఁ దన్నున్
మదనుం డేచఁగఁ దమిచే, నొదవిన యొకయమృతసిద్ధయోగమునందున్. 94

సీ. వైష్ణవి కౌమారి వారాహి చాముండ, బ్రాహ్మి మాహేశ్వరి బగళ లలిత
కాత్యాయ నింద్రాణి కాళరాత్రి భువనే,శ్వరి మహామాయి పంచదశ దుర్గ
భగవతి మాతంగి బాల మహాకాళి, కామేశ్వరియు భద్రకాళి శక్తి
మలహరి కృష్ణాక్షి మాధవీ శాంభవీ, శాకంభరియు లఘుశ్యామలాంగి
తే. మోహినీ కామరాజాఖ్యముఖ్యదేవి, రాజరాజేశ్వరియు మంత్రరాజరాజ
ముఖి వరూపిణి భైరవి ముఖ్యమాల, మంత్రములలోన మోహినీమంత్ర మరసి.

సీ. కడుభక్తి శుక్లపక్షమునఁ బుష్యార్కమి, నాఁడు హస్తిని వీథి నడుచువేళఁ
గుడియెడు గిడుసున్న గొని తెచ్చి శయనము, దిరము గోమయమున నెఱయ నలికి
మధ్యమంబున నెఱ్ఱమంటిప ట్టిడి పస,పున ముగ్గు గ్రోసఁగి మధ్యమునను మన్న
నెఱపి యాపైని నన్నెలఁతరూపము వ్రాసి, చుట్టుయంత్రము గురుస్తుతి యొనర్చి
తే. మొదల నోం హ్రీంవినిర్మించి మోహ మోహి, నీపటుస్వాహయనిమంత్రనియతిఁ దీర్చి
యందు దిగ్బంధన మొనర్చి యరుణగంధ, పుష్పదీపాదులను లెస్స పూజఁ జేసి.
ఆ. లక్షజపముచేసి లక్షణయుతముగఁ, దద్దశాంశము మధుతర్పణంబు
తద్దశాంశ మగుచుఁ దగు పలాశలతాంత, హోమవిధియుఁ దీర్చు చున్నయపుడు.



సీ. మినుకొప్పు సనుగొప్పుమినమిన ల్దొలాడఁ, గన్నులధళధళ మిన్నులాడ
బునుఁగిడ్డ నెఱపూతభుగభుగ ల్చెఱలాడ, గుబ్బలచకచక ల్దొబ్బులాడ
జిగిపూని తగుమేనిధగధగ ల్దిరుగాడ, నగుమోము నిగనిగల్ నాట్యమాడ
గుమిగూడుసరిదండఘుమఘుమ ల్పొరలాడ, నందెలఘుళఘుళ ల్చిందులాడ
తే. నెదుట సాక్షాత్కరించుమోహినికి నతఁడు
గరిమెతో లేచి మ్రొక్కినఁ గరుణఁ జూచి
తనకుఁ బూర్ణాహుతి యొనర్చి తప్పకుండఁ
దంత్రము ముగింపుమా నీవు దలఁచినట్లు. 98

క. వర మొసఁగెద నన నటువలెఁ, జరిపి మనోజాత పంచశర యని యంత్రా
వరణము దుడిచి మదీప్సిత,ము రయంబునఁ దీర్పు మనిన మోహిని యంతన్. 99

తే. మంచి దని యచ్చెలిని నావహించి శక్తి, తెచ్చి ముందట నిల్పి యదృశ్య యైన
సంభ్రమంబున సరసుండు సరసరతులఁ, బరవశత్వంబు నొందించి భ్రమము గొల్ప.

చ. కనుఁగవ విచ్చి చూచి యల కామిని యెక్కడి దీనికాంత మీ
ఘనుఁ డితఁ డెవ్వఁ డిట్టిరతి గల్గుట యేమని విస్మయంబుచే
మనమున నెన్ని యేమయిన మంచిదె నామదిఁ గోర్కెఁ దీర్చెఁ బ్ర
బ్బినమకరాంకు నింకఁ దనభృత్యునిగాఁ బని పూని యేలెదన్. 101

వ. అదియునుంగాక. 102

తే. భద్రుఁ డన దత్తకుఁ డనంగఁ బరఁగు కూచి, మార పాంచాల విట పీఠమర్దనాగ
రిక విదూషకు లనఁ బ్రౌఢరీతి మెలఁగు, నాయకులవంటిరసికుఁ డీనాయకుఁ డని.

చ. మనమున మెచ్చి నాయకుఁడు మానెఱజాణవు ప్రౌఢ వే క్రియన్
గొని రతి నేలిపాఁడ పనుకూలము నా కిది నిచ్చ నిచ్చలున్
ననవిలుకానికేళికల నన్ వెలయించు మటంచుఁ బల్కినన్
విని సరసుండు మంచి దని వేడుక నాతినిఁ బంపె నింటికిన్. 104

క. అది మొదలుచేసి హస్తిని, మది రంజిల సరసుమీఁది మమతను నిచ్చ
ల్మదనునికేళికిఁ బిల్చును, మదిఁ దనగృహమునకు సంచు దొరికినయెడలన్. 105

వ. ఇట్లు విహరింపుచుండి యొక్కనాఁడు. 107

క. మధ్యాహ్నవేళ జనతా, రాధ్యుం డగుసరసుఁ డలరి రతిపతికేళీ
సాధ్యత బుద్ధిమతాంకిమ, సాధ్య మ్మని యావధూటి సదనమె చేరెన్. 106

తే. చేరినప్పటిసరసునితీరుఁ జూచి, భుజము లుప్పొంగి హస్తినిపుష్పగంధి
కలయఁబడి మతి పన్నిటఁ గాళ్లుగడిగి, మేల మాడుచుఁ బోత్తెచ్చె ఘుచ్చుపోచ్చి.

సీ. జీవదంతపుజగాజీనినఖానుమే, ల్తళుకుటద్దపుబిళ్ల బెళుకురవలు
వింతసంతనఁ జేసి విప్పఁగాఁ దాపిన, హురుమంజుపోసల మెఱుఁగుకుచ్చు
లునిచి తీర్చినసొంపు మిను కైనకెంపురా, మొనముక్కు లూడెడు ముద్దుగులుకు
కలుకుఁగ్రొంబని పచ్చచిలుకలు రహిమించు, తొగరాచలువరాల నెగడు లోవ
తే. గలవగలనిండుపచ్చనిజిలుగుప్రతిమ, కతల నిరవొందు చిత్తర్వు కప్పురంపు
మెప్పు మేల్కట్లు చవికెలో మెరయ హంస,తూలికాతల్పమునఁ జేర్చి తోయజాక్షి.
క. తొడరి నునుగబ్బిగుబ్బల, పొడ వడఁగఁగఁ గౌఁగిలించి పొడమినదార్ఢ్యం
బెడలంగనీక మన్మథు, బెడిదపుదురమం దతనికిఁ బ్రియ మొందించెన్. 110
తే. ఇత్తెఱంగున వారిద్ద ఱేపు రేఁగి
మిథునకార్యప్రవిష్టులై మెలఁగుచుండ
దానిపతియింటి కరుదెంచి తలుపు దెరువు
మనిన నది యెట్లు బొంకెంగఁ జనునొ చెపుమ. 111
తే. తెలిసెనా నీవు హేమావతీలతాంగి
తెలియకుండినఁ జెప్పెదఁ దెలిసికొనుము
విభుఁ డటులఁ బిలిచిన విటుఁడు వడఁక
వెఱువకు మటంచు ధైర్యంబు గఱపి యపుడు. 112
చ. ముసుఁగిడి పండుకొమ్మనుచు మోహముతోడ వితర్దిఁ జూపి తా
నును రసు రంచు ఖిన్నయయి యొయ్యన నేగి కవాట మవ్వలన్
బెసబెసఁ ద్రోచి మాటఁ దలఁ బెట్టుక వచ్చినభర్త కింత సా
ధ్వస మొదవంగఁ జెప్ప విని వాఁడు వితావిత యేమి యంచనెన్. 113
వ. అని హీనస్వరంబున. 114
క. అడిగినపతితో నిట్లను, దడవాయెను సుంకరీఁడు తమలెక్కలకై
పడియున్నాఁ డిదె కనుమని, పడఁతి యతనిఁ జూపఁ జూచి భయ ముప్పొంగన్.
క. వెను కడుగు లిడుచు నవ్వలఁ, దనపొరుగింటను విభుండు దాఁగినచో జా
రునిరతితృప్తాంగ వే, తనిపి వెడల ననిపి తరుణి ధవునిం బిల్చెన్. 116
తే. పిలువ నతఁ డెప్పటట్లన ఖేదపడక, కూర్మితో నుండెఁ బతి దాను సుందరరదన
వింటివా యిట్టిచాతుర్యవిశదశక్తి, నీకుఁ గలిగినఁ బోవమ్మ నృపతి నెనయ. 117
చ. అని కలహంస చెప్పఁగ సుహాదరణంబున నాలకించునం
తనె తపనోదయప్రభలు తద్దయుఁ గాన్పడఁ గేళికానికే
తనమున కేగి యచ్చట సుధాకరబింబనిభాస్య ప్రొద్దుగ్రుం
కినఁ దను కావియోగమునఁ గేవలమున్ వెతఁ జెంది యుండుటన్ 118



క. కుముదమ్ములు కుముదమ్ములు, సముదమ్ములు గాఁగఁ మెఱయుఁ సాయం బైనన్
రమణీమణి ఘనరుచిభా, రమణీఘృణి సిరులు నిరులు రంజిలువేళన్. 119
సీ. తారకావృతపయోదముమాడ్కి సుమదామ, పరివృతం బగుకొప్పు పరిఢవిల్లఁ
దీఁగను వనలు హత్తినచందమున మేన, సొగసుగా రతనంపు సొమ్ములలర
వదనచంద్రునిగూడ వచ్చినరోహిణి, ముఱువున ముత్తెంపుముక్కు రమర
మంచు గప్పినగట్ల సంచున వలిపెంపుఁ, బైఁటలో గబ్బిగుబ్బలు చెలంగఁ
తే. బరఁగు జగడాలపగడాలభరణిలోనఁ, గ్రాలు మగరాల నిగరాలలీల విడెపు
టరుణరుచిఁ జిల్కు నోరఁ బల్వరుస మెఱయ, వచ్చినిల్చినయా హేమవతిని గాంచి.
క. జలజభవాశ్వం బిట్లనుఁ, జెలియా యింకొక్కగాథ చిత్రతరంబై
చెలు వొందెడిఁ జెప్పెద వినఁ, గలవే యని యడుగ వినెదఁ గాకని నిల్చెన్.
వ. హంసం బిట్లనియె. 122

## పదునేనవరాత్రికథ.

మ. ఇతరధ్యానము మాని నీవు వినుమా హేమావతీ ద్రావిడ
క్షితిలోఁ జిత్రవిచిత్రవస్తువితతిన్ జెన్నారు కాంచీపురిన్
స్థితుఁడై కాఁపుర ముండు శూద్రుఁ డొకఁ డాశ్రీదృష్టికిం బాత్రమై
శ్రితనానాజనభాగధేయ మగుచున్ సీరాంకనామంబునన్. 123
సీ. ముంగిటఁ బులిజాదములు గీచి యుండిన, రచ్చబండలు గొప్పప్రహరిగోడ
పంచదిన్నెలు చాదుపట్టెలు ముమ్మూల, గూండ్లు దీర్చినయట్టిగోడ లలరు
దేవరచవికె పందిరి కోళ్లగూడులు, గొఱ్ఱు గుంటుక కాడి క్రొత్తపల్చ
లట్టువగల గాడి కొట్టంబు పలుగడి, కంపపాతినలేగ కదుపుదొడ్డి
తే. ప్రత్తిగూటంబు తొట్టియు బలకపీట, బావి పిడకలకుచ్చెల పసులమేపు
మంగలము దాలి యోలుల్కి మారినిసందు, గలిగి విలసిల్లు నాతనినిలయ మెపుడు.
వ. అదియునుంగాక మఱియును.
తే. ముద్దగిద్దజపులమార్పు ముసుకుపచ్చ, మార్పుజీఁకపురిపరంగి మల్లెమార్పు
పాల్పసరకొమ్ముసూగూరిపైరజొల్ల,మసరవల్లెఱ్ఱజొన్న లమ్మంగఁ గలవు. 126
సీ. జడకొఱ్ఱ కొఱ్ఱలు చామలు వెలిచామ, కుట్టారి కారిక కొండబరిగె
బరిగెసజ్జయు గిడగిరసజ్జ మజ్జపా, ల్గిడ్డచే న్పెద్దరాగియును యవయు
గోధుమ పెదనువ్వు కుఱునువ్వు తెలినువ్వు, కులుమవెల్లగిసెయు గోఁగుజనుము
చిటితోట వెలిపెద్దచెవరఁగి పేరామి, దము చక్కెర చిఱుముదమును మఱియు

తే. మినుము పెర తెల్లకంది చిర్సెనగ సెనగ, పిచ్చ సలపిచ్చ కుఱుపిల్ల పెసరగాయ
మళ్ళు జలసందు లుబ్బ డాల్ నల్ల తెల్ల, యులవలు పటాణములు పుట్లకొలఁదిగలవు.

సీసమాలిక. బంగారుతీగెలు గంగాజలమ్ములు, కస్తూరినిగరాలు కటకసరులు
నిప్పపూరాజనా లేనుంగుకొమ్ములు, మల్లెశ్రీగంధులు మదనగంధు
లేలికరాజనా లీశ్వరప్రియములు, రావిపూరాజనాల్ రత్నసరులు
కుసుమపూరాజనా ల్గుత్తిబల్గుత్తులు, కస్తూరిపట్టెలు గంధసరులు
మందిగంద్రలు నాగమల్లెలు తీఁగెమ, ల్లెలు కృష్ణనీలాలు వెలువడాలు
మన్మథబాణాలు మరువంపుమొలకలు, సన్నమణింగెలు జున్నుఁబ్రాలు
పొన్నశ్రీరాజనా ల్పునుఁగురాజనములు, ముద్దుప్రాఁ బారళ్ళ ముత్తుసరులు
సన్నసూదులు పచ్చగన్నేర్లు గోదండ, రామము ల్కేసర్లు రాయసర్లు
చంద్రవంకలు జీనిసరులు కాంభోజులు, వంగాకు బోడములు పొఁగుబ్రాలు
జిరకర రాజనా ల్చింతపువ్వులు గోరు, రాజన ల్బాదపోర్లిల్ రాజనాలు
రామబాణాలు రెక్కేములు వెన్నముద్దలు జిల్మ బుడమలు దాళువాలు
గొప్పకొయాలు బలుగుత్తులు పాలమీఁ, గడలుశ్రీరంగాలు కామదార్లు
తెక్కపాలలు కాకి తెక్కలు పుష్పమం, జరులు సీతాభోగసరులు గౌరి
కుంకుమల్ రణబెండ్లి కొడుకులు పిచ్చుక, గోళ్ళు ప్రయాగలు గొజ్జఁబ్రాలు
గరుడసరు ల్పోతుగంటరాజనములు, మొగుగతొడిమలు ముదుకసరులు
పచ్చసరుల్ రెడ్డిపాలవంకెలు సుఖ, భోగులు పచ్చకర్పూరసరులు
నిప్వరు ల్దెబ్బస ల్నీరుకావులు గాజు, కప్పెర ల్కురువడా ల్కంఠసరులు
సాలంక లలుగురాజనములు సంభావు, లవసరదార్లు మోహనపుసరులు
మణిసరుల్మసరులు మంకెన ల్పగడంపు, తీఁగెలు మడిప్రాలు దేవసరులు
లత్తుకబొత్తలు లక్ష్మిమనోహరా, ల్భారతీసేసలు బాహుపురులు
వజ్రపుఁదళుకులు వాసనరాజనా, ల్జవ్వాణివంకెలు గవ్వసరులు
సంపంగిపూవడ్లు జాజిరాజనములు, గంబూరరాజనా ల్కన్నెసరులు
తుమ్మిపూరాజనా లమ్ముడుకొణిగెలు, జీనువముక్కలు చిలుకముక్కు
లేదుకత్రులు నంకె లిసుకరాజనములు, పులిగోళ్లవంకెలుఁ బొగడసరులు

తే. జిలితొగలరాజనమ్ములు నలఘరులును, డెల్లనల్లచెన్నంగులు దీపసరులు
నాది యగుపేరు గలుగువడ్లతనియింట, నుండుశతకోటిపుట్టులొక్కొక్కడినుసు.

తే. దొండకాయ ములుకకాయ తొట్లకాయ, జంబికాయయు నెత్రలసందకాయ
చిలయు నుస్తికాయయు రామములుకకాయ, మేడికాయ కాకరకాయగూడ నిండ.



సీ. రామగుమ్మడి యోబరాజుగుమ్మడి చార, గుమ్మడి బూడిదెగుమ్మడులును
గిండిసొఱయు దీఁగెకిన్నరసొఱయును, బీఱసముద్రపుబీఱ నేతి
బీఱ పిచ్చుకపొట్ల పెద్దపొట్లేసుఁగు, దంతపుట్లలు తంబలు వెలి
కాకర పొట్టికాకరలు మేఁకచెవి చిక్కుడు పాలగణపులగోరుచిక్కు

తే. డులు సుగంధాలు బొంతవంటులు సురభులు, గంజిపందిటికపురపొంకాయతరులు
బూజుపుచ్చకదోసానిపుచ్చ పెద్ద, దోస నక్కదోసలు వానితోఁటఁగలవు. 130

ఆ. చేమకంద గెనుసు చిత్రిగోరు పెండ్లము, పొసఁగు తెల్లగెనుసు భూతగెనుసు
లల్ల ముల్లి పసపు ముల్లంగి వెల్లుల్లి, గాజరయును మొదలు గాఁగఁగలవు. 131

చ. గురుగెఱ బొద్దె చెంచలియుఁ గుచ్చలి చిత్రి తగిర్సి తుమ్మి ను
స్సరి బలుగూటిబొద్దనెలి చల్మిలి పల్లెరు రూకపాత్కె పె
ల్వరిగిసె మున్గ వెల్గ చెవిపావిలి దొగ్గలి పొన్నగంటి దే
దరి నరవంజిచేత రసదాపయు గొండలి కొండపిండియున్. 132

తే. పాల వామింట తక్కలి బచ్చలి కొయి, గూర చక్రవర్తము చిల్కకూర గోళి
కూరగుంప బచ్చలి తోఁటకూర కొతిమ, రాకుసోపు మెంతాకు చుక్కకుగలదు.

సీ. పనస సీతాఫలా ల్చిననిమ్మ గజనిమ్మ, దూదినిమ్మయు నారమాదిఫలము
నాగదఖర్జూరనారికేళాదులు, రామఫలంబులు జామఫలము
లలరారు బొంతకిత్తళియుఁ బోఁకయుఁ బోక, పిప్పలి నేరేడు పెద్దవెలఁగ
రామాపళియు గమరక జీడిమామిడి, బాదంగి పెనురేఁగు పాలఫలము

తే. చెట్లుపండెడితోఁటలు చిట్టు గొట్టు, చెఱకు రసదాళిచెఱకెఱ్ఱచెఱకు నల్ల
చెఱకుతోఁటలు కలుజొడ్లు సీర్పి దినుసు, కారపాకొకుతోఁటలుగల వతనికి.

సీ. మామిడికాయయు మారేడుగాయయుఁ, గొండముక్కిడికాయ కొమ్మికాయ
గరగుకాయయు మొల్గకాయ యంగుగుకాయ, లుసిరికెకాయలు నుస్తికాయ
లేకరకాయయు వాకల్మికాయయుఁ, జిటినెల్లికాయయుఁ జిల్లకాయ
కలబంద గజనిమ్మకాయ నార్దపుకాయ, చిననిమ్మకాయయుఁ జీడికాయ

తే. కొండనపుకొమ్ము మామెనకొమ్ము బుడమ, కాయ యల్లము మురియంపుకాయ బీఱ
కాయ కంబాలు కరివేఁపకాయ లాది, యైన యూరుఁగాయలు గలవతనియింట

తే, పంట మోటాటి పెడగంటి పాకనాటి
యరవెలమలాదికొండాగె మొఱుసుగోన
కోణిదెకాఁపులు మొదలైనక్షోణిఁ దనరు
కాఁపులకు నెల్లమిన్న యక్కాఁపుకొడుకు. 136

క. తన కెదురుగ వచ్చిన తన, వనితామణి నపుడు చూచి వదనాంభోజం
బునఁ జిఱునవ్వొలయఁగ నెయ్యమున నానంద మొందె మానిని యంతన్. 371

తే. విభునిపదములు పన్నీట వేడ్కఁ గడిగి, నెచ్చెలులతోడ వెస నివాళిచ్చి వైచి
యింటిలోనికిఁ దోడ్తెచ్చి యింతు లెంచ, భర్తతోఁ గూడ నతిసుఖప్రాప్తి నుండె. 372

వ. అంత హేమవతీకాంతవృత్తాంత మంతయు నాత్మీయదూతి విన్నవించినవిని కంపితశి
రస్కుండై కొంతదడవు చింతించి మహారాజచంద్రుండును నీతిజ్ఞుండును సకళరసం
డును వివేకధురంధరుండును గావునఁ జిత్రభోగనృపాలుండు దనమనంబున. 373

ఉ. మున్నల రావణాదులు సముద్ధతిసాధ్వులఁ గోరి యేమి సౌ
ఖ్యోన్నతిఁ జెంది రిట్లగుట నుర్విజనావళు లన్యకాంతలం
బన్నుగఁ గోరరాదు కడుఁ బాతక మంచుఁ దలంచి యింతిపై
నున్నమనంబు ద్రిక్కొని యథోచితపద్ధతి నుండె భూవరా. 374

క. అనుచుఁ బురోహితుఁ డెఱిఁగిం, చిన నలరాజన్యమౌళి చిత్తాంభోజం
బున నద్భుతప్రమోదము, లెనయఁగ మెచ్చుకొని రాజ్య మేలుచు నుండెన్. 375

మ. నతసంజీవనజీవనేశభయకృన్నారాచనారాచర
వ్రతబృందారకదారకత్యనపదారక్షోభిరక్షోభట
శ్రుతసంధారణధారణార్హ్వమణిభాసుగ్రీవసుగ్రీవము
ద్ధతలాలాపనలాపనవ్యోచితాతారాపతారాపహా. 376

క. అక్షుద్విడ్లక్షుక్షి, త్తక్షేమకటాక్షదక్షదక్షతనూజా
ధ్యక్షనుతపక్షపక్షి, ప్రక్షుణ్ణోక్ష్యమవిపక్షరక్షాశిక్షా. 377

స్రగ్విణి. పద్మపత్రేక్షణా భక్తసంరక్షణా
పద్మగర్భస్తుతా భానుబింబస్థితా
పద్మబాణాకృతీ భవ్యశౌర్యోన్నతీ
పద్మసర్వేశ్వరా పాలితోర్వీశ్వరా. 378

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్రపవిత్రాయ్యలరాజాన్వయసుధావార్ధిపూర్ణిమా
చంద్ర నిస్సహాయకవిత్వనిర్మాణచాతుర్య నిస్తంద్ర శ్రీరామనామపారాయణనారా
యణామాత్యప్రణీతం బైనహంసవింశతి యనుమహాప్రబంధమునందు సర్వంబును
పంచమాశ్వాసము.

---

'వావిళ్ల' ప్రెస్, తండయార్పేట, చెన్నపురి.—1920.

